PR3VM02A128

సాహిత్య ప్రస్థానం
ఆగస్టు 2011
సంపుటి : 11 సంచిక : 67

# రచయితల బాధ్యత

గత నెలలో అందించిన దిక్సూచి ప్రత్యేక సంచికకు అంచనాలకు మించిన స్పందన లభించింది. ద్వితీయ ముద్రణ కూడా అవసరమైంది. అదే సమయంలో మన రచయితల అధ్యయన దృష్టి పెరగడానికి ఈ ప్రయత్నం ఏ మేరకైనా దోహదపడితేనే సంచిక లక్ష్యం మరింత సార్ధకమవుతుంది. అనేక రూపాల్లో అభినందనలు తెలిపిన వారికి కృతజ్ఞతలు చెబుతూనే ఇంకా సూచనలు, సలహాలు ఆహ్వానిస్తున్నాం.

.. .. ..

సాహితీ స్రవంతి ప్రకటించిన తమిళ రచయిత చిన్నప్ప భారతి అవార్డుకు విస్తృతమైన స్పందన వచ్చింది. ప్రముఖ కవులు, రచయితలు తమ రచనలు పంపించడం ఉత్సాహం నింపింది. వీటిని పరిశీలించి సెప్టెంబర్ చివరలో పురస్కారంపై తుది నిర్ణయం ప్రకటించగలమని తెలియజేస్తున్నాము.

.. .. ..

ఆంధ్రప్రదేశ్ రాజకీయ భవిష్యత్తుతో ప్రజల మనోభావాలతో కేంద్రం చెలగాటం కొనసాగుతున్నది. ఎడతెగని అనిశ్చితి రాష్ట్రాన్ని వెంటాడుతున్నది. ప్రాంతాల వారీ రాజకీయ క్రీడలకు స్వస్తి చెప్పి సహేతుకమైన రాజ్యాంగబద్ధ పరిష్కారం ప్రకటించవలసిన బాధ్యత కేంద్రంపైనే వుంది. ఈ రాజకీయ మాయాజాలాలను అప్రమత్తంగా గమనిస్తూ ప్రజలకు వాటి లోగుట్టు విప్పి చెప్పవలసిన బాధ్యత ఆలోచనాపరులైన రచయితలపైన వుంటుంది. సమరశీల చైతన్యానికి తప్ప స్వార్ధ రాజకీయాలకు తాము మద్దతు తెలుపబోమని స్పష్టంగా చెప్పవలసిన సమయమిది. తాత్కాలికోద్రేకాలకు, వివాదాలకు అతీతంగా ప్రజల మధ్య సుహృద్భావాన్ని నిలబెట్టవలసిన కర్తవ్యం ప్రజాస్వామికవాదులతో పాటు రచయితలు, కళాకారులపై వుంటుంది.

బొమ్మలు : శివాజి, వెంకటేష్



ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొరప్రసాద్
హిమజ్వాల

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# చెత్తోడు



- యెన్నం ఉపేందర్

**'అమ్మా చెత్తోడు వచ్చిండే' బాబు గట్టిగా అరిచాడు.**
**'కొద్దిసేపు ఉండమని చెప్పు. కొంత చెత్తుంది. అది కూడా వేస్తా' శ్రీమతి కూడా గట్టిగా బాబుకి చెప్పింది.**
**'అబ్బా! ఈ చెత్తోడు ఇంత పొద్దున్నే రావాల. నిద్ర చెడిపాయె' పెద్దవాడు గొణుగుతున్నాడు.**

గడ్డం చేసుకుంటున్న నాకు ఈ అనుభవం ప్రతిసారి ఎదురవుతున్న విషయమే. ప్రతిసారి 'చెత్తోడు' అని వినిపించే పదం నాకు చాలా ఇబ్బందిగా అనిపించేది. 'అలా అనొద్దు' అని చెబుతామనుకుంటాను. కాని అనలేకపోయేవాణ్ణి. 'ఎందుకు? బహుశః నేను కూడా వారి కోవలోకే చెందుతానా చెందుతానా' ఈ ఆలోచన కలిగిన వెంటనే చేసుకుంటున్న గడ్డం వదిలేసి.

'బాబు! చెత్తోడు అనొద్దమ్మా' అన్నాను అనునయంగా.

వాడు ఆశ్చర్యంగా నా వైపు చూసాడు.

'అవును. నువ్వు అలా అనకూడదు' అన్నాను.

'మరి అందరు అతన్ని చెత్తోడనే పిలుస్తున్నారు కదా' ప్రశ్న వేసాడు.

వెంటనే జవాబు ఈయడానికి కొంత ఇబ్బంది పడ్డాను.

'అందరు పిలుస్తున్నారని మనం కూడా అలా పిలవొద్దు. అతని పేరడిగి ఆ పేరుతోనే పిలవాలి' అన్నాను.

'అయితే అతని పేరేంటి' అడిగాడు.

ఈ ప్రశ్న అడిగేసరికి ఒకింత సిగ్గుగా అనిపించింది. కారణం నాకు కూడా అతని పేరు తెలియకపోవడమే. అతని పేరు నేను తెలుసుకోకుండా నేనెందుకు నీతి వాక్యాలు చెబుతున్నాను?

మౌనంగా మా ఫ్లాటు గుమ్మం బయటకొచ్చాను. అతన్ని చూసాను. మనిషికి యాభై సంవత్సరాలుంటాయి. నలుపు వర్ణం చొక్కా, పాంటు బాగా మాసి ఉన్నాయి. నన్ను చూడగానే,

'ఇంకెంతసేపు బాబు? ఇంకా చాలా ఇండ్లున్నాయి' కొంత విసుక్కున్నాడు.

'ఆ వస్తుంది. ఏం పేరు నీ పేరు' అడిగాను.

అతని ముఖంలో విసుగు మాయమై ఆశ్చర్యం విద్యుల్లతలా కనిపించింది.

'నా పేరా బాబు' నమ్మలేనట్లు అడిగాడు

'నీ పేరే' దృఢంగా పలికాను.

'సాలయ్య బాబు' అన్నాడు.

'ఎంతమంది పిల్లలు'

'ఇద్దరు బాబులు' అన్నాడు. ఇంకా ఏదో అడగబోయేంతలో శ్రీమతి వచ్చేసరికి సంభాషణ ముగించి ఇంట్లోకి పోయాను. ఆ రోజు ఆఫీసుకు పోయానన్న మాటే గాని, 'బాబు పేరడిగితే నేనెందుకు చెప్పలేకపోయానని' ఆలోచించాను.

ఆఫీసు నుంచి తిరిగొస్తూనే బాబుతో,

'నువ్వు చెత్తోడంటావే అతని పేరు సాలయ్య' అన్నాను.

నేను వస్తూనే బాబుకి ఉదయం విషయం గుర్తుకు తీసుకొచ్చేసరికి ఆశ్చర్యపడ్డాడు.

'అతన్ని సాలయ్య అని పిలుస్తావా' అడిగాను.

'ఓ అలాగే. అమ్మ కూడా పిలుస్తుందా' అడిగాడు.

శ్రీమతి వైపు చూసాను.

'వెనుకటికి ఏదో సామెత చెప్పినట్లు, ఏం పని లేకపోతే టి.వి. చూడొచ్చు కదా' సలహా ఇస్తూ వంట గదిలోకి వెళ్ళింది.

రోజు తప్పి రోజు సాలయ్య వస్తాడు. ఆ రోజు అతని కోసం నేను ఎదురు చూడసాగాను.



చూస్తుండగానే విజిల్ శబ్దం వినబడింది. నాకు సంతోషం కలిగింది. ఈసారి బాబు ఏమంటాడోనని ఎదురు చూడసాగాను.

'అమ్మా! చెత్త తీసుకుపోయే సాలయ్య వచ్చాడే' అన్నాడు బాబు. బాబుని దగ్గరికి తీసుకొని ముద్దు చేసాను.

సాలయ్య దగ్గరికి పోయి, 'ఇద్దరు పిల్లలు ఏం చేస్తుంటారు' అడిగాను.

నేను మొన్నటి సంభాషణని కొనసాగిస్తున్నానని అర్థం చేసుకొని,

'పెద్దవాడు ఇంజనీరింగ్ ఫైనల్, చిన్నవాడు ఫస్టియర్ ఇంజనీరింగ్' అన్నాడు.

నేను అదిరిపోయాను. నా ముఖంలోని భావాల్ని పసిగట్టి,

'అవును బాబు. పిల్లల్ని ఎలాగైనా చదివించాలని కష్టపడుతున్నాను' అన్నాడు.

నా కంటికి సాలయ్య నాలుగంతస్తుల మేడలా కనపడసాగాడు.

అది మొదలు సాలయ్యని ఎన్నో రకాల ప్రశ్నలు వేసేవాణ్ణి. అతను ఓపికగా జవాబులు ఇచ్చేవాడు. అతనితో ఓ రకంగా చాలా సాన్నిహిత్యం పెరిగింది. ఇంట్లో అతని గురించి రోజు ప్రస్తావించేవాణ్ణి. ఇంటి వాళ్ళలో కూడా కొంత మార్పు వచ్చింది. 'చెత్తోడు' అన్న పదం వాడకుండా జాగ్రత్త పడుతున్నారు.

అప్పుడప్పుడు అనిపిస్తుండేది. ఈ విశాల భారతదేశంలో ఎంతోమందికి పేర్లు లేవని, కొంతమందికి పేర్లున్నా. వాళ్ళ సొంత పేర్లు పెట్టి పిలిచే సంస్కారం లేదని.

'ఏయ్ ఫోర్ నాట్ సెవన్' అనో, ఆ గ్రూపు డి ని పిలు' అనో, ప్యూన్ లేడయ్యా అక్కడ' అనే పిలవటం ప్రభుత్వాఫీసుల్లో సర్వసాధారణం. అలా పిలిచినందుకు ఎవరూ ఆభ్యంతరం చెప్పరు.

ఇంకా కొంతమందికి పేర్లే లేవు. వీధి కూడలి మధ్య వాహనం అగగానే నలువైపులా చంటి పిల్లల్ని వేసుకుని పొట్ట చూపిస్తూ డబ్బులడుక్కునే వాళ్ళు, దేవాలయాల మెట్ల దగ్గర చిల్లర అడుక్కునేవాళ్ళు, ఇంకా ఎందరికో పేర్లు లేవు.

ఈ మధ్యలో నాకు ముంబైలో పేడర్ రోడ్ కూడలి మధ్య ఉన్న ప్రదేశంలో చూసిన దృశ్యం ఎక్కువగా జ్ఞాపకం రాసాగింది. ఓ నలభై ఏండ్ల మహిళ ఉదయం తొమ్మిది ప్రాంతంలో ట్రాఫిక్ మధ్య తన మూడు నాలుగేండ్ల బాబుకి తల దువ్వుతూ దువ్వెన నోట్లో పెట్టుకున్న దృశ్యమది. చుట్టూ వాహనాల రొద. అయినా ఆ తల్లి, బాబుని ప్రేమగా దువ్వుతూ తల్లి పాత్ర పోషిస్తుంది. బాబు పేరేంటో, తల్లికి పేరేమైనా ఉందో తెలియదు. వారికి బాంబే స్టాక్ ఎక్స్ఛేంజి ఎన్ని పాయింట్లు ఎగబాకింది అక్కర లేదు. మెరీనా బీచ్‌లో ఏం షూటింగ్ అవుతుందో తెలుసుకోవాలన్న ఇష్టం లేదు. వారి దృష్టంతా పొట్ట నింపుకోవటం పైనే, అందుకే 'చెత్తోడిని' సాలయ్యగా చూడటం.

ఆ రోజు సాలయ్య పెళ్ళి పత్రిక తెచ్చాడు.

'ఏంటి సాలయ్య' అడిగాను పత్రిక విప్పుతూ.

'బాబుకి పెళ్ళి సార్. సాఫ్ట్‌వేర్ కంపెనీలో ఉద్యోగం కూడా వచ్చింది' అన్నాడు.

అతని చేయి నా చేతిలోకి తీసుకొని ఇంట్లోకి తీసుకెళ్ళాను. సోఫాపై బలవంతంగా కూర్చోబెట్టాను. విషయం తెలుసుకున్న శ్రీమతి స్వీటు తెచ్చింది.

'ఎన్నడు పెళ్ళి?' శ్రీమతి అడిగింది.

నాకు చాలా ఆశ్చర్యం వేసింది. 'తానేనా అడుగుతుందని' అనుమానం కలిగింది.

'మేము పిల్లలతో సహా పెళ్ళికొస్తాము' శ్రీమతి హామీ ఇచ్చింది. ఆమె కళ్ళల్లో ఇసుమంతైనా కృత్రిమత్వం కనిపించలేదు.

సాలయ్య కళ్ళలో కన్నీళ్ళు.

'బాబుగారు! ఈ రోజు నాకు చాలా సంతోషంగా ఉంది. గత ఇరవై ఏండ్లుగా ఈ హైదరాబాదులో చెత్తోడని పిలిపించుకుంటున్నాను. మీ కుటుంబం నన్ను నా పేరుతో పిలవటమే కాకుండా, నన్ను ఇంట్లోకి పిలిపించి స్వీటు పెట్టారు. పై పెచ్చు పెళ్ళికి కూడా వస్తామంటున్నారు. నాకు పట్టరాని ఆనందంగా ఉంది' అంటూ చేతులు జోడించాడు.

అతని కళ్ళల్లోని తృప్తికి మా మనసులు ఇదివరకెప్పుడు కలగని ఆనందాన్ని అనుభవించసాగాయి.

●

# రాతి కెరటాలు

- డా॥ ఎన్. గోపి



రాతి గుండెను మించిన
నవనీతం మరొకటి లేదు.
తీగయి సాగినప్పుడూ
పువ్వయి సన్నని రేకులుగా
విచ్చుకున్నప్పుడూ
అలవిగాని భంగిమతో
ఆమెగా రూపొంది నర్తించినప్పుడూ
ఎవరు ఎట్లా స్పందించారో తెలియదు
కాలం గాలిలో
ఎన్ని రస సరోవరాలు
ఇంకిపోయాయో కనరావు.

రాయి కదలదు
కదిలేది చరిత్రే

వేల సంవత్సరాల కాళ్ళతో
బాబిలోనియా నాగరికత
నడుస్తూనే వుంటుంది.
ఆఫ్ఘనిస్తాన్‌లో బుద్ధ ప్రతిమకు
తపోభంగం అనేది వొట్టిమాట!
తాజ్‌లోంచి
ఓ ముక్కను తీసి పట్టుకుంటే
సకల మానవ స్వర్గీయ సంవేదనలు
మళ్ళీ మళ్ళీ పుట్టుకొస్తాయి.

వరల్డ్ ట్రేడ్ సెంటర్‌లో
శిలలెప్పుడూ కాలిపోవు
కాలిపోవాల్సినవి కార్పణ్యాలే.
చరిత్ర ఓ సముద్రం
రాయి ఒక అనాది పడవ
కదలని రాయివైపు
కదిలి వచ్చే తీరం.

ఇవ్వాళ రాయి
అతని చేతిలో ఆయుధమైంది
సమస్త ప్రకృతి
ఊపిరి బిగపట్టి చూస్తుంది
ఆ కాస్త ఆగండి
చరిత్ర మారుతున్నది

# సత్యం

- రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

అధ్యాత్మికతకు సంపదకు పెళ్ళి చేస్తే
పుట్టేవి ట్రస్టీలే
బాబాలైనా అమ్మలైనా అవ్వలైనా
ట్రస్టీ మావటీల అంకుశాలకు
తలవంచే ఏనుగులే
ప్రేమ ప్రబోధానికి
శాంతి ప్రవచనానికి
ఆశ్రమాల గుడులు గట్టి
ట్రస్టీల తొడుగులు గప్పి
రూపాయల తీగలు చుట్టితే
అవి
మనిషి శవమైనా గుచ్చుకుంటూనే ఉంటాయి
ప్రవచనాలు వెదజల్లే వెలుగుకు
ప్రశాంతంగా పేరుకునే చీకటికి
వైరుధ్యం పెరిగినప్పుడు
పుట్టపగిలి
సత్యం స్వావిష్కారమౌతుంది



# కమ్మని తేనెటీగ

- ఎస్.ఎస్.బి. గేరా



మట్టిలో ఒదిగిన విత్తనం
గుత్తులు గుత్తులుగా ఒంగినట్టు
సాగరాన్ని చేరిన సెలయేటి అల
ఉత్తుంగ తరంగమై ఎగసినట్టు
బడిగూటి కెళ్ళిన పసిగుడ్డు
వేకువ గువ్వై రివ్వుమన్నట్టు
అమ్మ చేతిలో రూపాయి మొగ్గలు
పొదుపు మాలలై పరిమళించేవి
అర్ధాంతర ఖర్చు తుమ్మెదలకు
మకరంద నిధులందించేవి
ఇంటాబయటా కలిసి
గండు తుమ్మెదలెన్నో తేనెను దండుకుపోతున్నా
పెట్టడమే గానీ కుట్టడమే తెలియని
కమ్మని తేనెటీగ–
అమ్మ

# తెలుగులో పాశ్చాత్య కవితా ధోరణులు



- ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న

ఫ్రెంచి, ఆంగ్ల కవితా రంగాల్లో వచ్చిన మార్పుల్ని, కవితా ధోరణుల్ని, మన ఆధునిక కవులు గమనించి వారి అడుగుజాడల్లో తమ కవితల్ని రాశారు. ఫ్రెంచి, ఆంగ్ల కవుల మాదిరిగానే భావంలోనూ, భాషలోనూ, ఛందస్సులోనూ, అనుకరించారు. అనుసరించారు. దాని ఫలితంగా ఆధునిక సాహిత్యంలో డాడాయిజం, భావచిత్రవాదం, ప్రతీకవాదం, అధివాస్తవిక వాదం, అభివ్యక్తీకరణవాదం లాంటి వింత వింత ధోరణులు చోటుచేసుకున్నాయి.

పాశ్చాత్య దేశాల్లో ముఖ్యంగా ఫ్రాన్సులో అనేక కొత్త కవితారీతులు వెలిసాయి. కాల్పనిక వాదానికి వ్యతిరేకంగా ఫ్రెంచిలోనూ, ఆంగ్లంలోనూ ఈ కవితా ధోరణులు పొడచూపాయి. చిత్రకళలో వచ్చిన కొన్ని ప్రయోగాల ప్రభావం సాహిత్యంపై పడింది. ఫ్రాన్సులో కళాసంబంధమైన ఉద్యమాల్లో క్యూబిజం, ఇంప్రెషనిజం, ఫ్యూచరిజం, డాడాయిజం, సర్రియలిజం, ఇమేజిజం, సింబాలిజం, ఎక్స్ప్రెషనిజం మొదలైనవి చెప్పుకోదగ్గవి.

ఆధునిక సాహిత్యంపై పాశ్చాత్య కవితాధోరణుల ప్రభావం బాగా కన్పిస్తుంది. ఫ్రెంచి, ఆంగ్ల కవితా రంగాల్లో వచ్చిన మార్పుల్ని, కవితా ధోరణుల్ని, మన ఆధునిక కవులు గమనించి వారి అడుగుజాడల్లో తమ కవితల్ని రాశారు. ఫ్రెంచి, ఆంగ్ల కవుల మాదిరిగానే భావంలోనూ, భాషలోనూ, ఛందస్సులోనూ, అనుకరించారు. అనుసరించారు. దాని ఫలితంగా ఆధునిక సాహిత్యంలో డాడాయిజం, భావచిత్రవాదం, ప్రతీకవాదం, అధివాస్తవిక వాదం, అభివ్యక్తీకరణవాదం లాంటి వింత వింత ధోరణులు చోటుచేసుకున్నాయి. వీటినే "నవ్యకవితా ప్రయోగాలు" అనీ, "ప్రయోగవాద కవిత్వం" అనీ, "నవ్య కవితా ధోరణులు", అనీ అంటారు. తెలుగులో శ్రీశ్రీ, నారాయణబాబు, ఆరుద్ర, పఠాభి మొదలైనవారు. పాశ్చాత్య కవితా ధోరణుల్ని అనుసరించారు. ఆధోరణులు ఇవి-

1. ఫ్యూచరిజం (Futureism)
2. డాడాయిజం (Dadaism)
3. భావచిత్రవాదం (Imagism)
4. ప్రతీకవాదం (Symbolism)
5. అభివ్యక్తీకరణం (Expressionism)
6. అధివాస్తవికవాదం (Sur-Realism)

## 1. ఫ్యూచరిజం (Futureism)

దీన్ని తెలుగులో "భవిష్యత్ వాదం" అని అంటారు. ఈ వాదం మొదటి ప్రపంచయుద్ధ సమయంలో పుట్టింది. మారినెట్ (Marinetti) "ఫ్యూచరిజం"కి ఆద్యుడు. ఇతడు ఇటలీ దేశానికి సంబంధించినవాడు. అరాచక వాదాన్ని, లేదా విధ్వంసక వాదాన్ని లక్ష్యంగా చేసుకొని వచ్చినవాదం ఇది. ధ్వంసంచేసిన శిధిలాలనుండే నూతన సృష్టి వస్తుందని ఫ్యూచరిస్టుల నమ్మకం. శతాబ్దాల తర్వాత తన సర్వశక్తుల్ని వినియోగించి, శ్రమించి సృష్టించిన సర్వకళాఖండాల్ని కావ్యాల్ని, కాల్చిబూడిద చేస్తేకాని, ప్రపంచం బాగుపడదని వీరి సిద్ధాంతం. యుద్ధం ఒక్కటే ప్రపంచానికి శరణ్యం అనీ, అదే మేలు చేస్తుందని వీరి ఉద్దేశం, పుష్కిన్, డాస్టోవస్కీ, టాల్ స్టాయ్ మొదలైన వారి రచనల్ని వీరు ఖండించారు. ప్రారంభంలో చాలా మంది రచయితలు ఈ ఉద్యమాన్ని అంగీకరించారు. రానురాను తమ దృక్పథం తప్పని తెలుసుకొని ప్రజాసాహిత్యాన్ని సృష్టించి ప్రజలకు దగ్గరయ్యారు.

## 2. డాడాయిజం (Dadaism)

మొదటి ప్రపంచ యుద్ధం దుష్ఫలితాల తర్వాత వచ్చిన ఉద్యమం ఇది. దీన్ని తెలుగులో "విధ్వంసకవాదం" అంటారు. ఈ వాదం యొక్క ప్రధాన ప్రయోజనం అరాచకాన్ని సృష్టించడం. ఆరాజక పరిస్థితుల్లో అవిర్భవించిన విధ్వంసకవాదాన్ని "డాడాయిజం" అంటారు.

1916 ఫిబ్రవరి 8వ తేదిన జ్యూరిచ్ నగరంలో ట్రిస్టన్ జారా (Tristan Tzara) అనే అతడు ఈ ఉద్యమాన్ని ప్రారంభించాడు. 'డాడా' అంటే ఫ్రెంచి భాషలో ఆటవస్తువు అని అర్థం అర్థరహితమైన ఆరాచకమైన తమ ఉద్యమానికి "డాడాయిజం" అని జారా పేరుపెట్టాడు.

డాడాయిస్టులు తాము ప్రదర్శించే అరాచక ప్రవర్తనతోనే ఆత్మ తృప్తిని పొందారు. వీరు అధిక్షేపాన్ని అవహేళనాన్ని దూషణాన్ని సాధనాలుగా చేసుకున్నారు. లోకాన్ని అసహ్యంగా వికృతంగా చూడటం, అయోమయత్వం వీరి ప్రధాన గుణాలు. వీరి సాహిత్యంలో భావంకానీ, వస్తువుకానీ, ఒక పద్ధతికానీ ఒక నియమంకానీ వుండవు. ఒక్కమాటలో చెప్పాలంటే సమాజంలో గందర గోళం లేవదీయటం తప్ప ఈ వాదం సాధించింది ఏమీలేదు. "డాడాయిజం" ప్రధానంగా నైరాశ్యాన్ని కలిగించింది. ఈ నైరాశ్యం ఆనాటి ఐరోపా సాహిత్యంలోనే కాక లలిత కళలన్నింటిలోనూ చాలా స్పష్టంగా కన్పిస్తుంది.

పాశ్చాత్య సాహిత్యంలో వచ్చిన "ఫ్యూచరిజం", "డాడాయిజం" ఈ రెండూ అరాజక వాదానికి సంబంధించిన ఉద్యమాలే. ఈ ఉద్యమాలు ఉద్దేశ్యాలు మంచివి కావు కాబట్టి ఎలా వచ్చాయో అలాగే త్వరగా అంతరించిపోయాయి.

డాడాయిస్టులు జీవితంపట్ల ప్రదర్శించిన అరాజక స్థితిని మన ఆధునిక కవులు కూడా అనుకరించారు. శ్రీశ్రీ రాసిన న...న....న....నత్తిమాటలు, "హూష్ హూష్" అనే కేకలు డాడాయిజం ప్రభావంతో వచ్చినవే. పూషా రాసిన "కల్చర్ అండ్ అనార్కీ" అనే గేయంలో ఈ ధోరణి కన్పిస్తుంది. శ్రీశ్రీ, వరద, ఆరుద్ర ఈ ముగ్గురూ కలిసి రాసిన "మేమే" అనే గేయ సంపుటి ఈ ధోరణిలోకే వస్తుంది. కె.వి.రమణారెడ్డి గారి 'అడవి' లోని "సత్యం, శివం, సుందరం", అనే గేయంలో అరాజక ధోరణులు చోటుచేసుకున్నాయి.

"నిందిస్తున్నాను నేను పరిశుద్ధమైన గ్రంథాన్ని
నిందిస్తున్నాను నేను దిగంబర న్యాయాన్ని
........................ మంగళ సూత్రాన్ని
నిందిస్తున్నా నేను"

ఇందులోని అరాజకత్వాన్ని తీవ్రంగా ప్రేరేపిస్తున్నాడు. ఈ రకమైన రచనలు సమాజానికి ఆరోగ్యకరమైనవి కావు. ఇలాంటి రచనలు తెలుగులో అక్కడక్కడా వచ్చాయి. పరమ జుగుప్సాకరమైన భావాలు ఈ ధోరణిలో చోటు చేసుకోవడం వల్ల మన ఆధునిక కవులు ఈ వాదాన్ని పెద్దగా అనుసరించలేదు. ఆదరించలేదు.

## 3. భావచిత్రవాదం (Imagism)

ఆధునిక సాహిత్యోద్యమాల్లో "ఇమేజిజమ్" ఒకటి. తెలుగులో దీన్ని "భావచిత్రవాదం" అని అంటారు. రస భావాత్మకమైన అసాధారణ మానసిక స్థితిని క్షణ మాత్రంలో ప్రకటించేదాన్ని "ఇమేజ్" అంటారు. అలాంటి మానసిక స్థితిలో మానవుడు దేశకాల పరిస్థితులకు అతీతంగా స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తాడు. ఉత్తమోత్తమమైన కళాఖండాన్ని సమీపించేటప్పుడు హఠాత్తుగా మనకు కలిగే అభ్యుదయానుభూతే అది. దాన్ని కవి భావచిత్రంగా రూపొందిస్తాడు.

దాశరథి తన "మహాబోధి" అనే ఖండ కావ్యంలో బుద్ధుని గూర్చి విశదీకరించాడు.

"దయకు సాగరమ్ము ధర్మమునకు గని
సత్యమునకు రావు శాంతమునకు
పుట్టినిల్లు సత్త్వమున కాలవాలమ్ము
జ్ఞానమునకు తాన కాణయాచి"

ఈ గేయంలో సాగరం, గని, రావు, పుట్టినిల్లు, ఆలవాలము, కాణయాచి మొదలైన పదాలు అర్థవంతాలై స్ఫూర్తిని కల్గిస్తున్నాయి. ఇందులో భావచిత్రాన్ని మనం గమనించవచ్చు.

విశ్వనాథసత్యనారాయణ గారి "కిన్నెరసాని పాటలు" లో–

"జల జలా పొంగింది
బిల బిలా నడిచింది.
పరికిణీ తొక్కాడు పదియేండ్ల కన్నెలా"
చిన్న గంతులు వేయు తెల్లనా బెలాయ్య
పసిపాప సెలవి వారిన బోసినవ్వులా"

కవి కిన్నెర సానివాగును స్త్రీగా ఊహించి ఆమెరూపాన్ని అలతి అలతి పదాల పోహళింపులో అందంగా వర్ణించారు. ఇందులోని పదాలన్నీ అర్థమయ్యేవిధంగా వున్నాయి. కిన్నెర పొంగింది. నడిచింది. ఆ నడక పదేళ్ళ వయస్సుగల కన్నె నడకలా వుండటమే కాక, చిన్న చిన్న గంతులు వేసే తెల్లనాబెయ్య, పసిపాప సెలవివారిన బోసినవ్వువలె కిన్నెర వుంది. సాదృశ్యాలు సందర్భోచితాలై కిన్నెర స్థితిని తెలియజేస్తాయి. ఇందులో విశ్వనాథవారు చూపిన భావచిత్రం ఎంతో మనోహరంగా వుంది.

## 4.ప్రతీకవాదం (Symbolism)

సాహిత్యంలో "ప్రతీకాత్మక వాదం" ఎందరినో ఆకర్షించింది. ప్రభావితం చేసింది. 1890 తర్వాత పాశ్చాత్య రంగంలో అనేక మార్పులు చోటుచేసుకున్నాయి. బ్లాడ్లేర్, వేర్లేన్, మలార్మే ఈ ముగ్గురూ సింబాలిస్టు కవిత్వ ధోరణికి ప్రతినిధులు, వారిలో ప్రతీకల (Symbols) విలువను పైకెత్తి చూపినవాడు బ్లాడ్లీర్, దానికి మెరుగులు దిద్దిన వాడు వేర్లేన్. వానికి తాత్వికతను చేకూర్చిన వాడు మాలార్మే.

ఒక శబ్దం కానీ, శబ్ద సముదాయం కానీ, ఒక వస్తువునో, క్రియనో, సంఘటననో సూచిస్తూ అది తిరిగి వేరొక అంశాన్ని సూచించేటప్పుడు అది 'ప్రతీక' అవుతుంది. వేగానికి లేడి, జిత్తులమారితనానికి నక్క కుటిలత్వానికి పాము మనకు జ్ఞాపకం వస్తాయి. అలాగే శుక్ల పక్ష చంద్రుడు అభివృద్ధినీ కృష్ణపక్ష చంద్రుడు క్షీణదశనూ, సూర్యోదయం పుట్టుకనూ, అస్తమయం మరణాన్ని సూచిస్తాయి. కవి దీనిని ప్రతీకలుగా మలుస్తాడు. ఉపమానం "ప్రతీక" కాదు. అదేవిధంగా రూపకం కూడా. అది కేవలం అలంకారం మాత్రమే. ప్రతీకల్లో వుండే లక్షణం ఏమంటే అది ఒక అర్థానికి పరిమితం కాకుండా అనేక అర్థచ్ఛాయలకు అవకాశమిస్తుంది. అందుకే కవిత్వానికి ప్రాణం ప్రతీకలు.

తెలుగులో ప్రతీక వాద ప్రభావం వున్న కవులు చాలా తక్కువమంది వున్నారు. ప్రాచీన కవులు కాంతిని విజ్ఞానానికీ, చీకటిని అజ్ఞానానికీ సంకేతాలుగా వాడారు. చిన్నయసూరి మిత్రలాభం, మిత్రభేదం కథల్లో పశుపక్ష్యాదుల్ని ఒక్కొక్క తత్త్వానికి ఒక్కొక్క ప్రతీకగా తీసుకొని నీతిని ఉపదేశించాడు.

రాయప్రోలు సుబ్బారావు 'చిల్క' అనే గేయంలోనూ 'యాత్ర' అనే గేయంలో ప్రతీకల్ని వాడారు.

1909–1917 మధ్య కాలంలో అమెరికా, ఇంగ్లాండ్, దేశాల్లో "ఇమేజిజమ్" ఒక ఉద్యమంగా ప్రారంభమైంది. టి.ఇ.హ్యూమ్,

హ్యూమ్, ఫ్లింట్, అల్లింగ్‌టన్ జోసఫ్ కాంఫ్‌బెత్, ఎజ్రాపౌండు మొదలైన కవులుకలిసి లండన్ నగరంలో 1909లో ఒక నవ్య కవితోద్యమాన్ని లేవదీశారు. అదే "ఇమేజిజమ్". ఇమేజిస్టు కవులు కవితాశిల్ప సంప్రదాయాల్ని అన్యభాషల నుండి గ్రహించారు. ఈ ఉద్యమం కొంతకాలం మాత్రమే వుంది. క్రమ క్రమంగా నశించిపోయింది. 1913 సంవత్సరంలో ఫ్లింటు, ఫౌండ్ చేసిన సంయుక్త ప్రకటనలో ఇమేజిజమ్ కవితకు గల లక్షణాల్ని వివరించారు. వీరు సహృదయ పాఠకులకు అర్థమయ్యే రీతిలో చెప్పడానికి ప్రయత్నించారు. భాషలో గజిబిజి లేకుండా విషయాన్ని వీలైనంత వరకు సూటిగా, స్పష్టంగా చెప్పడానికి ప్రయత్నం చేశారు. ఇదే ఇమేజిస్టుల ప్రధానోద్దేశ్యం.

తెలుగులో ప్రత్యేకంగా "ఇమేజిజం" అనేది లేకపోయి నప్పటికీ, మన కవులు రాసిన కవితల్లో అక్కడక్కడ "ఇమేజిజం" కన్పిస్తుంది.

శ్రీశ్రీరాసిన 'బాటసారి' గీతం భావచిత్రానికి సంబంధించిందే.

"కూటి కోసం కూలికోసం
బయలుదేరిన బాటసారికి
మబ్బుపట్టీ, గాలి కొట్టీ
వాన వస్తే, వరద వస్తే
చిమ్మచీకటి కమ్ముకొస్తే
దారితప్పిన బాటసారికి
ఎంతకష్టం".

ఇందులో బాటసారి కూటి కొరకు, కూలి కొరకు ఏ విధంగా తపించి అనుభవించింది తెలుస్తుంది. నారాయణబాబు గేయాల్లో చాలా భావచిత్రాలు కన్పిస్తాయి.

"దంతపు వీణైతేనేమి
ఒళ్ళు
తెగిపోయిన తీగె
బతుకు
మేళని చేయని హృదయం
నీ వ్రేళ్ళకు
బాధే మిగులు
నను ముట్టకు
నా చక్కని స్వామి"

పై గేయంలో ఒక వేశ్య వర్ణించబడింది. ఆమె ఆకారం ఎంత అందంగా వుంటుందో అంత దీనత్వం ఆమెబ్రతుకులో వుంది. ఆమె జీవితం ఇందులో చెప్పబడింది. దంతపువీణ వేశ్య మేలిమి వన్నెను, తెగిపోయిన తీగ కాలం గడిచిన తర్వాత, వయసుజారిన తర్వాత, కన్పించే స్వరూపాన్ని. శరీరంపై వ్యాపించిన అనారోగ్యపు చిహ్నాల్ని విశదీకరించాడు. ఈ గేయంలో నీలిమ చూపుల లోతుల్ని చూచిన, మేళన చేయని హృదయం కనబడుతుంది.

ఆరుద్ర 'త్వమేవాహం'లోని ఇసుక గడియారం మున్నగునవి కాలానికి, సమాజానికీ ప్రతీకలు. బాలగంగాధరతిలక్ మధ్యతరగతి మానవుని ఉద్దేశించి 'కిటికీ', 'దీపం', 'గొంగలిపురుగులు' మున్నగునవి ప్రతీక కవితా మార్గంలో తిలక్ రాశాడు. ఆలూరి బైరాగి "నూతిలో గొంతుకలు" అనే పేరు తన కావ్యానికి పెట్టాడు. ఇందులో అనేక ప్రతీకలు చోటు చేసుకున్నాయి. శ్రీశ్రీ రాసిన ప్రతిజ్ఞ, నీడలు, పేదలు నవకవిత గేయాల్లో ప్రతీకలు కన్పిస్తాయి.

శ్రీరంగం నారాయణబాబు రాసిన 'గడ్డిపరక' సమాజంలో హీనంగా చూపబడే జీవికీ పెట్టుబడిదారుల కాళ్ళకింద నలిగిపోయే మానవునకు సంకేతం. గేయమంతా అతని జీవితాన్ని ఆధారంచేసుకొని నారాయణ బాబు రాశాడు.

కరుణశ్రీ 'తప్పులేని తమ్ముడు' ఖండికలో ప్రతీక తొంగి చూస్తుంది. నండూరి సుబ్బారావుగారి "ఎంకి పాటలు"లో "గోవు మాలచ్చిమి" అనే గీతం ప్రతీక కవితకు చెందింది. "గోవు మాలచ్చిమి" సకల సంపదలకు అనంతమైన సుఖానికి సంకేతం. నండూరివారు గోవును లక్ష్మిగా స్వీకరించి రాశారు.

సి.నా.రె రాసిన "మనిషి-చిలక" అనే కావ్యంలో 'పంచవన్నెల ఆ రామచిలక', పరమాత్మకు ప్రతీక. ఆదేవిధంగా "ఇంకిపోయిన బావి" అనే ఖండిక భావదారిద్ర్యంతో బాధపడుతున్న ఛాందస తత్వానికి ప్రతీక. గుంటూరు శేషేంద్రశర్మ "మండేసూర్యుడు" కావ్య సంపుటిలో ప్రతీకలు వాడారు. ఇందులో సూర్యుడు ప్రగతికి ప్రతీక. 'నేను చెమట బిందువుని' అనే కావ్యంలో చెమట బిందువు శ్రామికునకు ప్రతీక. ప్రతీకవాదంతో అనేక గేయాలు తెలుగులో వచ్చాయి.

### 5.అభివ్యక్తీకరణ (Expressionism)

ఇటలీదేశానికి చెందిన క్రోచే (Benedettocroce) సిద్ధాంతాల ఆధారంగా 'అభివ్యక్తి వాదం' ఏర్పడింది. దీన్నే 'ఉక్తివాదం' అనీ,'వ్యక్తిత్వ వాదం' అనీ అంటారు. అభివ్యక్తి కళ (Expressionsitic art) ఒక ఉద్యమంగా స్వీడిష్‌నాటకర్త Strendbeg ప్రభావంతో ప్రారంభమైంది. 1915-25 మధ్యలో ఈ ఉద్యమం పరాకాష్టకు చేరుకుంది. సాహిత్యంలోనూ, ప్రధానంగా నాటకం, సంగీతం, చిత్రకళల్లోనూ దాని ప్రభావం కన్పిస్తుంది.

అభివ్యక్తి నాటక కర్తల విలక్షణమైన శైలిలో సంభాషణల్ని కూరుస్తారు. కాంతి, శబ్దం కల్గించే ఎఫెక్టును గిరగిర తిరిగే రంగస్థలాన్ని (Revolving) ఉపయోగిస్తారు. అత్యాధునిక రంగస్థలాన్ని అన్ని విధాలా ఉపయోగిస్తారు. Bertoltbrecht లాంటి జర్మన్ అభివ్యక్తి నాటకకర్తల ప్రభావం అమెరికన్ రూపకాల మీదకూడా పడింది. Theater of the absured లోకి అవాస్తవిక ప్రయత్నాల్లోనూ, చలన చిత్రాల్లోనూ అభివ్యక్తివాదం ప్రభావం కన్పిస్తుంది.

అభివ్యక్తి కళ ఎన్నిరకాల రచనల్లో కనబడినా, దాని ప్రభావం ముఖ్యంగా నాటకాల్లోనే కన్పిస్తుంది. కళలో అభివ్యక్తి అంటే నాటకాలే మనకు గుర్తుకు వస్తాయి.

### 6. అధివాస్తవిక వాదం (Surrelism)

చిత్తకళతో అధివాస్తవికతావాదం ప్రారంభమైంది. తర్వాత సాహిత్యంలోకి వచ్చింది. ఫ్రాయిడ్ చెప్పిన సైకో ఎనాలిసిస్ (Psycho Analysis) ఆధారంగా ఈ వాదం ఆవిర్భవించింది. శ్రీశ్రీ సర్రియలిజంను నిర్వచిస్తూ "అపస్మారక మనసు నుండి స్వప్నలోక

రహస్యాలను సంగ్రహించడానికి చేసే ప్రయత్నం సర్రియలిజం" అని అన్నారు. సర్రియలిజంకి సంబంధించిన కవితలు రాసిన వారు శ్రీశ్రీ, నారాయణ బాబు, పఠాభి, ఆరుద్ర, శిష్ట్లా మొదలైన వారు.

అధి వాస్తవిక కవితల ప్రధాన లక్షణాలు ఇవి.

1. అర్థం కాని ఆలోచనల్ని ప్రదర్శించడం
2. అన్వయం కుదరని పద ప్రయోగాల్ని వాడటం
3. హేళన
4. చమత్కారాలు
5. కామప్రాధాన్యం-విధ్వంసనం
6. ప్రతీకలు వాడటం
7. భావచిత్రాల్ని ప్రదర్శించటం.
8. ఛందోబందో బస్తుల్ని చిత్రించటం-నత్తి మాటలు వాడటం

శ్రీశ్రీ "De-Composition", "విదూషకుని ఆత్మహత్య" "టాంటాం", "కొంటెకోణాలు", "అభిసారికి కడసారి", "అధివాస్తవికుల ప్రవేశము" మొదలైనవి అధివాస్తవిక గీతాలు.

శ్రీశ్రీ "కొంటె కోణాలు" అనే గీతంలో సర్‌రియలిజం'ను ఇలానిర్వచించాడు.

"జీ బ్రాకి Algebra చిహ్నాల
లాంకోటూ, పాంకోళ్ళు తొడిగి
సాహిత్య పౌరోహిత్యం చేస్తే
వెఱ్ఱికాదు. Sur-realism రా సోదరా"

ఇందో జీబ్రా వేరు, ఆల్జీబ్రావేరు ఈ రెంటికి శబ్ద సామ్యం వుంది. జీబ్రాకు ఆల్జీబ్రా చిహ్నాల లాంకోటు (లాంగు కోటు) తొడగడం కూడా అర్థం లేనిది. దాన్ని తొడగడానికి సాహిత్య పౌరోహిత్యం చేయటానికి ఎలాంటి సంబంధం లేదు. కాబట్టి అ సంబద్ధత, అనర్థకత, శబ్ద చమత్కారం సర్రియలిజం లక్షణాలని శ్రీశ్రీ చెప్పాడు.

"పులికి పిలక లేదనడం
చలికి తెలుగు రాదనడం
శ్రీనివాసరావు వ్రాస్తున్నది
మా నిషాద గీతంలో ఉన్నది"

ఇందులో సమన్వయం లేని అర్థంకాని పద ప్రయోగం కన్పిస్తుంది.

ఇంకో రచనలో శ్రీశ్రీ అధివాస్తవిక ధోరణికి నిదర్శనంగా

"5,3,2 ఆముక్త మాల్యద
ఆటవెలది ద్విపదకత్త గారు"

అని అన్నారు. ప్రౌఢ ప్రబంధమైన "ఆముక్త మాల్యద" ను హేళన చేయడానికి శ్రీశ్రీ ఇలా రాసినట్లు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

మరో గేయంలో శ్రీశ్రీ

"తురాయి కంటె ఆ
కురాయి కంటె, హిమాం
శురాయి గొప్పవాడు."
అని అన్నాడు.

ఇందులో మూడురాళ్ళు ప్రయోగించబడ్డాయి. ఈ మూడూ, రాళ్ళు కాకపోవటం చమత్కారం. శ్రీశ్రీ రాసిన ఈ గేయాల్ని బట్టి శబ్ద చమత్కారం, హాస్యం అర్థాల అసంబద్ధత అధివాస్తవిక కవిత్వం అని అర్థవుతుంది. వీటితోపాటు జుగుప్సాప్రియత్వం, కామోద్రేక ప్రకటనం, తీవ్రభావ ప్రదర్శనం అనేవి ముఖ్యమైన లక్షణాలు వున్నాయి.

నారాయణ బాబు రాసిన "లెండోయి ఋషులు", "మౌనశంఖం", "భావం", "చిన్నా, "నీవెవరే", "గేదెపెయ్యి" మొదలైన కవితల్లో అధివాస్తవిక ధోరణి చాలా స్పష్టంగా కన్పిస్తుంది.

నారాయణ బాబు "చిన్నా" అనే గేయంలో

"మన్ను తింటున్న చిన్న
మీ నాన్న నిన్ను కొడితె
ఏమిటి అలా చూస్తావు
నీ చూపులు .........
......................."

పఠాభి శబ్దాల్లోనే కాకుండా అచ్చులో కూడా చమత్కారాన్ని చూపించారు.

అద్దము తిరిగెను
తలక్రిందులైనది.

శార్వరి ఆంగ్లంలో అంకెల్లో కొన్నిటిని ఉపయోగించి ఉచ్చారణ ద్వారా తెలుగు పదాలు సృష్టించారు...

అపాయం 3తుంది
6భైట పడుకొన్న ప్రదేశం
జనత 7స్తుంది.

ఆరుద్ర 'త్వమేవాహం' లో "స్టాపువాచి" గేయంలో

నీ
గన్
నా
పెన్
ఆపెన్
కాపాడున్

తెలుగు పదాలతో ఆంగ్ల పదాల్ని కూర్చి చెప్పడం ఆరుద్రకు వెన్నతోపెట్టిన విద్య. అనవసరమైన పదాల్ని వాడడం వల్ల కొన్ని పదాల్ని వాని రూఢ్యర్థాలకు బదులుగా డొంక తిరుగు అర్థాలతో వాడటం వల్ల అన్యాయాన్ని పాటించకపోవడం వల్ల అధివాస్తవిక వాదం తెలుగులో నిలబడలేకపోయింది.

ఈ విధంగా తెలుగులో కొంత మంది కవుల రచనల్లో పాశ్చాత్య కవితా ధోరణులు చోటు చేసుకున్నాయి. ఈ కవితా ధోరణులు ఆధునిక తెలుగుసాహిత్యంలో శాశ్వతంగా నిలదొక్కుకోలేకపోయాయి. బహు తక్కువ కాలంలోనే ఈ ధోరణులన్నీ తెలుగులో కనుమరుగయిపోయాయి.

# వర్తమాన కవిత్వం - కవి



- కె. ఆనందాచారి

తన భవిష్యత్తుపై తనకే నమ్మకం చెదిరిపోయి రాబేయే సంక్షోభాల భయోన్మాదాలకు పెట్టుబడుల స్వామ్యం ఆక్రోశిస్తున్నట్టుగానే కవులు రచయితలు నిరాశ, నిస్తేజాలలో మునిగి పోతున్నారు. ఇంకోవైపు ఆధునిక భోగలాలసతలో, భౌతిక వాంఛలలో కూరుకుపోవడమూ కనిపిస్తుంది. ఇంతేకాక గ్లోబల్ ఆర్థిక దోపిడీని విస్తృత పరిచేక్రమంలో వస్తున్న అనేక వాదాల, విచ్ఛిన్నతల వలలో చిక్కుకుపోయి ఆ ప్రవాహంలోనే తానూ కొట్టుకుపోవడమై మనం చూస్తున్నాము.

మనం ఏదైనా కథైనా కవిత్వమైనా వ్యాసమైనా విమర్శైనా ఎందుకు రాస్తున్నాము! ఎందుకు రాయాల్సి వస్తోంది? అసలెందుకు రాయాలి? ఇవన్నీ ఇప్పుడే కొత్తగా వేస్తున్న ప్రశ్నలు కావు. వీటన్నింటిపై ఇంతకుముందే చర్చ జరిగింది. సమాధానాలూ చెప్పారు. కానీ ఈ ప్రశ్నలు మళ్లీ ఒకసారి వేసుకొని తాజాగా సమీక్షించుకోవాల్సిన అవసరం మాత్రం వుంది. గత మూడు నాలుగు దశాబ్దాలుగా మన ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితులలో ఎంతో మార్పు వచ్చింది. రాజకీయ, ఆర్థిక కార్యకలాపాల్లో మౌలిక మార్పులూ వచ్చాయి. వాటి ప్రభావాలు మనపై పెరిగాయి. అందుకనే పై ప్రశ్నలపై పునః చర్చించాలని నా అభిప్రాయం.

సాహిత్య రంగంలో అగ్రస్థానాన్ని ఆక్రమించే కవిత్వం యొక్క భవిష్యత్తును గురించిన సందేహాలు కొనసాగుతున్నాయి. కవిత్వాదరణ మరీ క్షీణావస్థకు చేరుకున్నది. అయితే రోజు రోజుకూ పెరుగుతున్న కవులకూ ఆవిష్కృతమవుతున్న కావ్యాల సంపుటలకు కొదవలేదు. నిత్యం వెలువడుతూ వున్నాయి. మరివాటిని చదివేవారు ఎవరనేది ప్రశ్నగానే మిగులుతోంది. కవుల సమూహంలో తన సంబంధీకులు, స్నేహితులు ఏ కొద్ది మందో చదవటం సమీక్షకులు చదివి పరిచయం చేయటం మినహా మరెవరూ కవిత్వం జోలికి పోవటంలేదు. కవితా సంకలనాలు కొని చదవటం అసలు జరగటంలేదు. కవి కూడా కవిత్వం తన కవి సమూహానికి చేరితే చాలనుకుంటున్నాడు.

ప్రజలు కూడా ముఖ్యంగా మధ్యతరగతి పాఠకులు సాహిత్య పఠనానికి, కవిత్వ పఠనానికి ఆసక్తి చూపటంలేదు. గత రెండు దశాబ్దాలుగా పాఠక లోకంలో చాలా మార్పులువచ్చాయి. మధ్య తరగతిలో పెరిగిన ఆర్థిక కార్యకలాపాలు వొత్తిడి వారిలోని సాహిత్యాభిబాషను ఇగిరింపచేస్తోంది. మెదడు యొక్క చలనం పెరిగింది. హృదయవైశాల్యం తరుగుతోంది. మానవ నాగరికతా పరిణామంలో ఆర్థికాంశాలు ప్రధానమైనప్పటికీ నేటి పరిస్థితి మరీ విశృంఖలంగా తయారైంది. రాజకీయ ఆర్థిక అరాచకానికి ప్రతిబింబమే మన కళాసాహిత్యాల నేటి పరిస్థితి, కళా సాహిత్యాలకూ ప్రజలకూ మధ్య గల భావ సంబంధం సడలింది. ఇది కవిత్వానికి మరీ పెరిగింది. పాఠకులలో కలుగజేస్తున్న ఆర్థిక వొత్తిడి కవిపై కూడా పెరిగింది. కవిత్వంలోని సంకేతాలు పూర్తిగా కవి వ్యక్తిగత అనుభూతుల నుండి మాత్రమే తీసుకోవడం జరుగుతోంది. సామూహికానుభవాలలోంచి వచ్చే ప్రతీకలు నేడులేవు. ఎవరి భావాజాలం వారిది. ఎవరి ప్రమాణం వారిది. వస్తువు కంటే రీతి ముఖ్యమైనది. ప్రయోజనం కంటే శిల్పం ప్రధానమైంది.

తన భవిష్యత్తుపై తనకే నమ్మకం చెదిరిపోయి రాబేయే సంక్షోభాల భయోన్మాదాలకు పెట్టుబడుల స్వామ్యం ఆక్రోశిస్తున్నట్టుగానే కవులు రచయితలు నిరాశ, నిస్తేజాలలో మునిగి పోతున్నారు. ఇంకోవైపు ఆధునిక భోగలాలసతలో, భౌతిక వాంఛలలో కూరుకుపోవడమూ కనిపిస్తుంది. ఇంతేకాక గ్లోబల్ ఆర్థిక దోపిడీని విస్తృత పరిచేక్రమంలో వస్తున్న అనేక వాదాల, విచ్ఛిన్నతల వలలో చిక్కుకుపోయి ఆ ప్రవాహంలోనే తానూ కొట్టుకుపోవడమై మనం చూస్తున్నాము. దార్శకనికుడుగా వుండాల్సిన కవి రచయిత దీన్నుండి బయటపడి సామాజిక పురోగతితో తన పాత్రను, కర్తవ్యాన్ని నిర్వర్తించాల్సి వుంది. అందుకనే ఒక సారి వెనక్కు వెళ్ళి మనం ఎందుకు రాస్తున్నాము, ఎందుకు రాయాలి, వాళ్ళెందుకు చదవాలో చర్చించుదాము.

... ... ...

"సంవేదనలను, అనుభూతులను, ఆలోచనలను అందమైన రూపంలో వెల్లడించాలనే కామన మానవులందరికీ సహజం" అంటారు

మహారచయిత గోర్కి 'నిజ జీవితంలో కష్టాలు, బాధలూ ఎదురైనప్పుడు చెప్పుకోవటానికి మరో మార్గం కావాలి' అని నోబెల్ బహుమతి గ్రహీత గుస్తావ్ చెబుతాడు. రాయటంలో అనుభూతికి, మనసుకు సంబంధించి ఉన్నప్పటికీ అన్ని పనుల మాదిరిగానే అదీ ఒక పని. మనకు సాహిత్యం లేకపోతే జరగదా? జరుగుతుంది. పశుపక్ష్యాదులకు జరిగినట్టే? పశుపక్ష్యాదులు జీవిస్తాయి. అనుభవం పొందుతాయి. కాని అవి జీవితాన్ని జీర్ణం చేసుకోలేవు. అనుభం నుంచి విజ్ఞానం సంపాదించలేవు. జీవితాన్నీ అనుభవాన్ని జీర్ణించుకొనే శక్తికూడా అందరు మనుషులకూ వుంటుందనుకోవటం అతిశయోక్తే, అటువంటి శక్తి అందరికీ వుంటే సాహిత్యం అవసరమేలేదు. కానీ అందరికీ వుండే శక్తి ఏమిటంటే, సామర్థ్యం, నైపుణ్యంగల వాళ్ళు అనుభవసారాన్ని సాహిత్య రూపంలో అందిస్తే దాన్ని జీవితానికి వినియోగించుకుని తమ జీవితాలను వికాసవంతం చేసుకొనే శక్తి కూడా వినియోగించని జాతి భ్రష్టమైన జాతి. ఏ జాతి మీద ఆ జాతి యొక్క సాహిత్య ప్రభావం కనిపించదో ఆ జాతి భ్రష్టమైన జాతి. అంటూ విశ్లేషిస్తారు కొడవటిగంటి.

జీవితాన్ని నిత్యనూతనంగా ఇంకొంత తేజోవంతంగా మనిషిమనిషిగా బ్రతకాలనే కోర్కెను రగిలించడానికి సాహితీసృజన తోడ్పడుతుంది. అయితే సాహిత్య కళకు మూలం ఒక సమాజానికి చెందిన జీవితం మెదడులో ప్రతిబింబించిన ఫలితంగా ఉత్పన్నమయ్యే భావచిత్రాలే రచనలూ కళావస్తువులు, కళలకి సాహిత్యానికి అవసరమైన ముడిపదార్థల గని ప్రజల జీవితం.

కళ సాహత్యం వల్ల రసానుభూతి కలుగుతుంది. రసానుభూతి వల్ల ఆనందం కలుగుతుంది. ఈ ఆనందమే జీవిత మకరందం. అదే కళాసాహిత్యాలు సాధించే లక్ష్యాలు అంటారు. మన పెద్దలు. కళకోసమే అనే భావనలోకి తీసుకుపోతుంది ఈ భావన. 'సంపదకోసమే సంపద' విజ్ఞానం కోసమే విజ్ఞాన శాస్త్రము అనేదీ అంతే. 'సమస్త మానవ కార్యకలాపాలూ ప్రయోజన రహితంగా సోమరిగా ఉండి పోకుండా వుండాలంటే అవి మానవాళిని ఒకింత ముందుకు తీసుకుపోయేందుకు తోడ్పడాలి. సంపద ఎందుకు వుంటుంది. మానవుడు లబ్ధి పొందేందుకు, విజ్ఞానశాస్త్రం ఎందుకుంటుంది. మానవుడికి మార్గదర్శకంగా ఉండేందుకు. అలాగే కళా సాహిత్యాలు కూడా నిష్ఫలమైన ఆనందానికి కాక ఏదో ఒక ఉపయోగకర లక్ష్యానికి తోడ్పడాలి. కళ, సాహిత్యం జీవితాన్ని పునరుత్పత్తి చేయడం మాత్రమే కాకుండా దాన్ని అది వివరిస్తుంది. సాహిత్యకళా సృజనలు చాలా తరుచుగా "జీవిత విషయాలపైన తీర్పు చెప్పే లక్ష్యం కూడా కలిగి వుంటాయి." తీర్పులు చెప్పటమే కాదు జోక్యం చేసుకోవడమూ వుంటుంది. మానవ జాతి వికాసంలో కళా సాహిత్యాల పాత్ర అద్వితీయమైనది.

మానవ శ్రమ సృజనల చరిత్ర మానవుని చరిత్రకంటే ఎంతో ఎక్కువ ఆసక్తికరంగా, ప్రముఖంగా వుంటుంది. విజ్ఞాన శాస్త్రానికీ సాహిత్యానికి ఉమ్మడి అంశాలు చాలా వున్నాయి. ఎందకంటే విజ్ఞాన శాస్త్రం తత్సంబంధిత టెక్నాలజీయే జీవితానికి అత్యంత ప్రధానమైనదిగా మెదడుకు మాత్రమే పనిచెబుతున్నాము. పరిశీలన, తులనాత్మక అధ్యయనం రెండింటిలోనూ ప్రముఖ పాత్ర వహిస్తాయి. రచయితకీ, శాస్త్రవేత్తకీ భావనా శక్తీ, సద్యోజనిత జ్ఞానం వుండితీరాలి. భావనా శక్తీ సద్యోజనిత జ్ఞానమూ వాస్తవాల గొలుసులోని ఖాళీలను భర్తీచేయడానికి ఉపకరిస్తాయి. ప్రకృతి శక్తులనీ, దృగ్గోచర విషయాలనీ లొంగ తీసుకోవడం ద్వారా మానవుడి మనసూ, ఇచ్ఛా మానవ సంస్కృతిని నిర్మిస్తాయి. ఇదే మన అపరసృష్టి. ఫ్రెంచి నవలారచయిత, మహా రచయితలలో ఒక డైన బాల్జాక్ ఓ పుస్తకంలో కొన్ని గ్రంథులు గురించి రాశాడు. అప్పట్లో విజ్ఞాన శ్రాస్తానికి తెలియని కొన్ని శక్తివంతమైన గ్రంథస్రావాలు మానవ శరీర నిర్మాణం మీద ప్రభావం కలిగిస్తాయని, శారీరక మానసిక లక్షణాలకి కారమవుతాయని అనుకొన్నాడట. కొన్ని దశాబ్దాల తర్వాత మనకు తెలియకుండా వున్న గ్రంథులు మానవ శరీరంలో వున్నట్లు కనిపెట్టడం, ఆ రకంగా 'వినాళ గ్రంథుల' నే ముఖ్య సిద్ధాంతం యేర్పడ్డం జరిగాయి. ఇలాగ అనేకమంది విజ్ఞానశాస్త్రవేత్తలు రచయితలుగా వుండటాన్ని మనం చూస్తాము.

జీవితాన్ని నిత్యనూతనంగా ఇంకొంత తేజోవంతంగా మనిషిమనిషిగా బ్రతకాలనే కోర్కెను రగిలించడానికి సాహితీసృజన తోడ్పడుతుంది. అయితే సాహిత్య కళకు మూలం ఒక సమాజానికి చెందిన జీవితం మెదడులో ప్రతిబింబించిన ఫలితంగా ఉత్పన్నమయ్యే భావచిత్రాలే రచనలూ కళావస్తువులు, కళలకి సాహిత్యానికి అవసరమైన ముడిపదార్థల గని ప్రజల జీవితం. ఆ ముడిపదార్థాలు తమ స్వభావ సిద్ధమైన రూపంలో వుండి మొరటుగా వుంటాయి. కానీ ఎంతో ముఖ్యంగాను, సుసంపన్నంగాను, మేలిరకంగానూ ఉంటాయి. సాహిత్యానికి మానవుడి సామాజిక జీవితం ఒక మూలాధారమైనప్పటికీ అది సాహిత్య కళలకన్నా పోల్చరానంతగా జీవనంలో తొణికిసలాడే సారవంతమైనదీ. అయినప్పటికీ ప్రజలు జీవితంలో తృప్తిపడి ఊరుకోక సాహిత్యం కళలను కూడా కోరుతారు. ఎందుకంటే, వాస్తవమైన జీవితంకన్న సాహిత్య కళలలో ప్రతిబింబించే జీవితం మరింత ఉన్నత స్థాయిలోను, మరింత గాఢంగాను, ఏకాగ్రంగాను, మరింత లక్షణాన్వితం గాను, ఆదర్శానికి సన్నిహితంగాను, సార్వజనీనంగాను వుంటుంది.

అయితే శారీరక శ్రమ నుంచి మానసిక శ్రమ వేరైనప్పునుండి సమాజంలో శ్రమ విభజన మొదలైంది. అప్పటి నుండి చైతన్యమైనా, భావాజాలమైన సమకాలికమైన ఆచరణలో తమకు ఏ నిమిత్తమూ లేదన్నట్లుగా ఒక భ్రమకులోనై వాస్తవ ప్రపంచం నుండి బైటపడి శుద్ధ సిద్ధాంతంగా రూపొందాయి. ఇదంతా అపచైతన్యం. భావాలనేవి స్వతంత్ర పదార్థాలైనట్టూ స్వచ్ఛదంగా అభివృద్ధి చెందగలిగేట్టు, తమ ధర్మాలకు మాత్రమే తాము నిబద్ధమనట్టూ అనిపిస్తుంది. తాము చైతన్యవంతంగానే భావాజాలాన్ని రూపొందిచుకోగలమని జ్ఞానపరులు అనుకుంటారు. ఏ వాస్తవ కారణాల మూలంగా తమకు భావప్రేరణ కలుగుతుందో తెలియక అసత్యకారణాలను ఊహించుకుంటారు. ఇది కవిత్వాన్ని తన వాస్తవమైన పాత్రనుంచి వేరుచేసి శుద్ధ చైతన్యం కోసం ప్రాకులాడేట్టు చేస్తుంది. అందుకే ఇందులో నిరాశ, విరహం, మృత్యువర్ణన, జ్ఞాపకాల దృశ్యీకరణ లేదంటే తిరుగుబాటు కనిపిస్తుంది. ఆవశ్యకతల నుండి తప్పుకొనే స్వేచ్ఛను కోరుకుంటుంది.

సాహిత్య సృజనకు కారణంగా కవిలో ఉండే ప్రతిభను భావనా శక్తి అంటాము. జీవిత పరిస్థితుల రూపమైన సామాజిక చైతన్య వివేకంగా రచయితలలో కనిపించే 'తెలివే' ఈ భావనాశక్తి తప్ప మరేమీ కాదు. అయితే అ తెలివి మిగిలిన వారిలో ఎందుకులేదు? అసలు రచయితలల్లో కూడా అందరిలో ఒక రకంగాలేదు. అంతఃకరణమన్నది మనుషులందరికీవున్నా అందరూ సమాజంలో జీవిస్తున్నా, సమాజ జీవితం అందరి అంతఃకరణ మీదే ఒకే రకంగా ప్రతిఫలిచటంలేదు. అందరి అంతఃకరణాలూ ఒక రకంగా ప్రతిఫలించుకొనే పరిస్థితిలోలేవు. దానికి అనేక కారణాలున్నాయి. అది కారణంగా రచయితలకు ప్రత్యేకమైన ఉన్నత స్థితిని ఆపాదించటానికి వీలులేదు. ప్రతిభ అన్నది లోకాత్తర విషయం కాదు. సమాజ జీవిత ప్రభావం వల్లనే సామాజికులు యధయోగ్యంగా చైతన్య వంతులవుతున్నారు. చైతన్యవంతులు కావటం అంటే జీవితం అంతఃకరణము మీద ప్రతిఫలించిన దాన్నిబట్టి అనుభవాత్మకంగా ఏర్పడే భావాలకు అనుకూలంగా కానీ ప్రతికూలంగా కానీ ప్రవర్తించటం.

సమాజంలో వచ్చే పరిణామాలవల్ల జీవితంలో ఎంత అపూర్వత వస్తున్నదో దాని ప్రతిఫలం వల్ల భావంలోనూ అపూర్వత ఏర్పడుతుంది. కవులు రచయితలు జీవితంలో అపూర్వత కోరుకుంటారు. అంటే పరిణామాలకు సుముఖంగా వుండటం. పరిణామాలకు విముఖయిన కవి జీవితంలో అపూర్వత అన్వేషించదు. అభిలషించదు. అలాంటి వాళ్ళ రచనల్లో వస్తువుకూ అపూర్వత వుండదు. కానీ పురోగామి జీవిత దృక్పథం వున్న రచయిత దేశకాలాలకు తగినట్లుగా అపూర్వతకై అర్రులు చాస్తునే ఉంటాడు. సమాజ జీవితంలోని అపూర్వతకు స్పదించి దాన్ని అంతఃకరణంలో ప్రతిఫలించుకొని , ఆ అనుభవానికి సామాజిక ప్రయోజనం దృష్ట్యా వస్తు రూపాన్ని నిర్మాణం చేయటం వల్లనే కవులూ, రచయితలూ ప్రజలందరి నుండీ ముందుకు వచ్చి మార్గదర్శకులు కాగలుగుతున్నారు.

కానీ నేడు కవుల్లో రచయితల్లో ఆ దార్శనికత కనిపించడం లేదు. సామాజిక జీవితంలోని సారాన్ని పట్టుకునే ప్రయత్నం చేయకపోగా పైపై విషయాల ప్రభావంలో స్పదించి ప్రభావశీలంగా సృజన చేయలేకపోతున్నారు. అంటే సామాజిక జీవిన ప్రవాహాన్ని అభిముఖంగా చూడక ప్రవాహంలో వారూ పోతున్నారు. అయితే రచయితే మనస్తత్వం అతని పరిసరాలమీద ఆధారపడుతుంది. సాంఘీక జీవనం కూడా దాన్ని ప్రభావితం చేస్తుంది. ఇక్కడే రచయిత అప్రమత్తత అవసరం. ఒంటి కంటి చూపు చారిత్రక సత్యాన్ని పాక్షికంగానే చూస్తుంది. నేటి పెట్టుబడీవ్యవస్థ మౌలిక నియమాలలోనే వైరుధ్యం వుంది. ఆ ప్రభావం కవిలోనూ వుంటుంది. ఈ వ్యవస్థలోని వైరుధ్యం దాని పతనానికి కారణమవుతుంది. దీన్నుండి బయటపడటానికి ప్రపంచాన్ని అనేక రకాలుగా చీల్చుతారు. వ్యతిరేక శక్తులలో యుద్ధాలు జరుగుతాయి. ఒక్కోసారి బహిరంగంగా ఒక్కోసారి అంతర్గతంగా యుద్ధం సాగుతుంది. దీనికి కారణం పెట్టుబడీ వ్యవస్థ విస్తృతిలో విప్లవాత్మకమైన ఉత్పత్తి పెరుగుతుంది. కానీ ఇది వినియోగించుకోలేని స్థితలో సంక్షోభం వస్తుంది. ఈ సంక్షోభాలు కొనసాగతూనే వుంటాయి. వారు చెప్పే స్వేచ్ఛ మార్కెట్కు మాత్రమే పరిమితమైపోయి ప్రజల్ని బానిసల్ని చేస్తుంది. వ్యక్తుల చైతన్యం సామూహికతల నుండికాక ఆర్థికాంశాల సారంగా నిర్ణయింపబడుతుంది. ఇందుకు ఉద్వేఘ్నతలను రెచ్చకొడతారు. ఈ పరిస్థితుల ప్రభావాల్లోంచే నేటి కవి కూడా భావోద్విగ్నుడై ఒంటరిగా నిలబడతాడు. తనది ఒంటరి పోరాటం అనుకుంటాడు.

**నేటి కవి ఉద్వేగాలు, ఆలోచనలు సమాజమంతటికీ దర్పణంగా వుండటం లేదు. ఒక భాగానికి కొన్ని ముక్కలకు మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. సామాజిక జీవితాలలోని సంఘర్షణలలోని వాస్తవికతను గమనించలేక పోతున్నాడు. తాను కూడా సంఘర్షణల జోలికి వెళ్లకుండా జీవితాన్ని కవిత్వంలో దృశ్యమానం చెయ్యాలనే ప్రయత్నమే కనిపిస్తోంది. అందుకే ఇక్బాల్ ఇలా అంటాడు- నవ్వు జీవితంలో వున్న రహస్యాలను తెలుసుకోవాలంటే సంఘర్షణలతో తప్ప మరెక్కడా లభించవు.**

అనుభూతులు జీవిత వాస్తవాలకు ఎంతదూరంగా వుంటే అంత గొప్ప అని భావించే ఊహాత్మక, ఆత్మాశ్రయ, అది వాస్తవిక సాహిత్యం వస్తుంది. హింసా ప్రవృత్తికి, అనుబంధంగా లైంగిక విశృంఖలత, పాశ్చాత్య క్షీణ సంస్కృతి మొదలైన అవలక్షణాలన్నీ మనల్ని ముంచేస్తున్న తరుణమిది. అసలు సమాజంలో కవికీ తక్కిన జనానికీ యెడబాటు కలిగి వాస్తవ సామాజిక కర్తవ్యం నుంచి కవిత్వం దూరమయ్యాక కూడా కవిత్వం ఆకాశ పుష్పాల కోసం తహతహలాడటం మానలేదు. అవాసవ్తమైన భ్రమలతో కూడా, ఇంకా సాధ్యంకాని వాటికోసం ప్రలాపిస్తూ ఉన్నతమైన చిత్తవృత్తిని కలిగించి స్వప్న లోకంలో సచరింపచేయటం కవిత్వ గుణంగా మిగులుతోంది.

కవిత్వమనేది స్వప్న ప్రపంచం లాంటిదని జార్జ్థాంప్సన్ మరియు కాడ్వెల్ వర్ణించారు. అంటే వాస్తవ ప్రంపచానికి పూర్తి విరుద్ధమైనదనీ వాస్తవ జీవిత ప్రమేయాలతోటి సంబంధమేమీ లేదని అర్థం కాదు. దృశ్యమాన ప్రపంచం నుండి కల్పనా ప్రపంచానికి చైతన్యాన్ని మారుస్తుందంటే వాస్తవ జీవితంలో వ్యక్తుల మధ్య అసంఖ్యాకంగానూ, విధంగానూ కనిపించే విభేదాలను మరచి, అందరికీ సమానమైన మౌలిక వాంఛలనూ ఆశయాలనూ ప్రకటించేట్టుగా సగం కలవంటి మానసిక స్థితిని కలిగించడమేనని అర్థం. కవిత్వానికున్న ప్రభావం వల్ల సహానుభూతి పెరుగుతుంది. అంతేగాక అసాధ్యాన్ని కూడా సాధ్యం చేసుకోవలెననే కోరికనూ, అవాస్తవాన్ని కూడా వాస్తవం చేసుకోగలమనే ఆత్మవిశ్వాసాన్నీ తద్వారా వ్తాసవాన్ని మార్చడానికి తగిన చైతన్యమూర్తిని కలిగిస్తుంది. కానీ అసమ సమాజంలో చైతన్యం ఒక వైపే పోగుబడి సంకోచించి, గట్టి పడుతుంది. ఎందుకంటే అది సమాజ నిర్మాణాలకు తెంపుకుంది గనక, ఫలితంగా అది అకడమిక్గా టెక్నిక్గా అభివృద్ధి చెందుతుంది.

ఇక ఇవ్వాల్టి మనిషి కూడా ఒంటరిగా ఉన్నాడు. విడిపోయేవైపు అడుగులు వేస్తున్నాడు. తనకెవరూ లేరనుకుంటాడు. తనకుతానే బాగుపడాలనే తొందరలో ఆత్మిక కోర్కెలను వొదిలేస్తాడు. అతను ఎక్కడికీ వెళ్లలేదు. ఎవరూ అతణ్ణి కోరుకోరు. తన అసక్తత

# అక్షరానుబంధం

- బి.ఎ. నరసింహులు



ఓ కాంతి పుంజంలా నా
అక్షరబంధం వెలుగునిస్తూ
నాకు దారి చూపుతూ
అంధకారం అలముకున్నప్పుడు
మంచీ చెడుల సంఘర్షణలో
న్యాయా న్యాయాల మధ్య
నేను కొట్టుమిట్టాడుతున్నప్పుడు
వాస్తవాన్ని తేటతెల్లం చేస్తూ
తోడు నీడగా నిలుస్తుంది
ఎల్లప్పుడు దాని మార్గంలోనే
నా జీవనం పయనం
ఒక్కోసారి కనికరించడానికో
అన్నట్టు మానవీయ పరిమళాల్ని
అద్దుతుంది మనసుకి
ఒక్కోసారి ధిక్కరించడానికో
అన్నట్టు ధనావేశాల్ని సృష్టిస్తుంది

వ్యక్తిత్వపు వికాసానికి
ఒక్కోసారి తిరస్కరించడానికో
అన్నట్టు వాస్తవాన్ని బయల్పెడుతుంది
ఆ బంధం నాకో బోధనోపకరణం
ఆ బంధం నాకో కార్యసాధనం
ఓ నిరంతర ప్రక్రియలాగ
ఆ అనుబంధం మరింత విస్తృతమౌతూ
పదును పెడుతుంది నా బుర్రని

ఎక్కడైనా ఎప్పుడైనా
సుఖ దుఃఖాల రెంటినీ
సమతూకం వేస్తూ నాకు
అభయహస్తం అందిస్తుంది
నాలోని నిరాశను పారద్రోలి
శక్తియుక్తుల్ని ప్రోది చేసుకుని
బతుకు సమరం సాగించమంటుంది
విజయబావుటా ఎగురవేయమంటూ
రుణాత్మక భావజాలపు నీలినీడలు
నాపై ప్రసరించినప్పుడల్లా హెచ్చరిస్తూ
బతుకులో నవ్యతనూ
స్వచ్ఛతనూ స్పష్టతనూ
అనుసరించామంటూ ప్రబోధిస్తుంది
నడతను దిద్దుకోమంటుంది
మార్పు అనివార్యతను గుర్తించమంటుంది
అక్షరం ఓ ఆశీర్వచనమై
నన్ను దీవిస్తుంది నాలో కొండంత
ఆత్మవిశ్వాసం నింపుతూ!!

---

తెలిసి అతను గందరగోళపడతాడు. పతనం తప్పదని తెలిసి భయ విహ్వలుడవుతాడు. జీవితంలో అతని విలువేమిటి? అతని సౌందర్యం ఎక్కడవుంది? శిథిలమైన నాడీ మండలంలో, నిర్వీర్యమైన మేథలో, మానసిక వ్యాధుల నిలయమై సగం చెడిపోయిన దేహంలో ఆనవీయతకు స్థలం మరుగైపోతుంది. మనిషి శక్తి ఎట్లా విచ్ఛిన్నమౌతున్నదో చూసి కొందరు మేధావులు "నేను"లోకి కొత్త జీవితాన్ని, తాజా తనాన్ని నింపవలసిన అవసరం గుర్తించి శక్తిని పెంచే మార్గాన్ని వీళ్లు చూపుతారు. మానవజాతి అసంఖ్యాక కణాలతో తయారైన బ్రహ్మాండమైన శక్తి వనరు. దానిలోంచి ఒక కణాన్ని విడదీస్తే వెంటనే అంతరించిపోతుంది అన్నాడు స్ట్రిండ్ బర్గ్. వ్యక్తి పాత్ర అనే సిద్ధాంతం పుట్టుకొచ్చింది సాంఘీక లక్ష్యాలను వ్యక్తులు మాత్రమే సాధించగలరని నొక్కి చెప్పబడుతోంది.

కవి హృదయం ఇప్పుడెంత మాత్రమూ కలగూరగంపకాదు. జీవిత ధ్వనులన్నింటికీ ఆనందానికీ కన్నీళ్లకూ ప్రతిస్పందించే తంత్రీ కాదు. కవి కూడా అక్షరాల మనిషి అయిపోతున్నాడు. సత్యాల పరిశీలనల ఉన్నత శిఖరాల నుండి అతను సంకుచిత జాగ్రత్తల మైదానాలలోకి జారిపోతున్నాడు. భావాలను పదాల తెంపులలో నింపుతున్నాడు. రూపమనేది అంతకంతకూ నిశితమవుతున్నది, పదజాలం నిర్లిప్తమవుతోంది. వస్తువు విస్తరణ తగ్గిపోతోంది. భావాల వ్యక్తీకరణలో, విషయాల స్పష్టీకరణలో ఆత్మవిశ్వాసం సన్నగిల్లుతోంది. నేటి కవి ఉద్వేగాలు, ఆలోచనలు సమాజమంతటికీ దర్పణంగా వుండటం లేదు. ఒక భాగానికి కొన్ని ముక్కలకు మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. సామాజిక జీవితాలలోని సంఘర్షణలలోని వాస్తవికతను గమనించలేక పోతున్నాడు. తాను కూడా సంఘర్షణల జోలికి వెళ్లకుండా జీవితాన్ని కవిత్వంలో దృశ్యమానం చెయ్యాలనే ప్రయత్నమే కనిపిస్తోంది. అందుకే ఇక్బాల్ ఇలా అంటాడు- నవ్వు జీవితంలో వున్న రహస్యాలను తెలుసుకోవాలంటే సంఘర్షణలతో తప్ప మరెక్కడా లభించవు. సముద్రంలోకి వెళ్లి విశ్రాంతి తీసుకోవడం నదికి లజ్జాకర విషయం అని.

అంటే ఈ మొత్తం విశ్లేషణలో కవి నేడు ఎదుర్కొంటున్న పెను సవాళ్ల గురించి కొద్దిగా చర్చించటం జరిగింది. అయితే ప్రగతి కాముక నిబద్ధకవులు అనేక ఇబ్బందులను ఎదుర్కొంటూనే ముందుకుపోయే ప్రయత్నమూ చేస్తున్నారు. సామాజిక ఆర్థిక వొత్తిడులు ఈ రకమైన వాతావరణాన్ని సృష్టిస్తూ దాడి చేస్తున్నప్పుడు కవి ఇంకా ఎంతో అప్రమత్తంగా వుండాలి. అంతేకాదు కవిత్వాదరణకు, కవిత్వానికి అవసరమైన సామూహిక భావావేశాలు కలిగిన సామాజిక ఉద్యమాల నిర్మాణంలోనూ పాలుపంచుకోవాలి. జీవితాలను జీవిత సంఘర్షణలనూ పరిశీలించాలి. ప్రజల జీవద్భాషను పట్టుకోవాలి. సామూహికతలలోంచి వచ్చిన భావ చిత్రాలను ఉపయోగించాలి. నిత్య నూతనమైన సాధారణ ప్రజల జీవితం కవిత్వ వస్తువుగా మారాలి. సమాజంలో జరుగుతున్న దానికి కవులు సాక్షులుగా మాత్రమే నిలువొద్దు, కేవలం ఆశిసస్తూ కూర్చోవద్దు. క్రియాశీలమైన సాహితీకారులుగా మారాలి. సామూహిక మానవానుభూతుల నుండే సత్యాన్వేషణ సాగుతుంది, అదే కవి చెయ్యాల్సింది. అప్పుడే మన కవిత్వాన్ని సాహిత్యాన్ని అందరూ తమదిగా భావిస్తారు.

There has never been, nor can there be, any human search for truth with out human emotion - Lenin

# అంబేద్కర్ భావాలకు అచ్చమైన ప్రతిబింబం బోయి భీమన్న



- డా॥ అద్దేపల్లి రామమోహనరావు

అంబేద్కర్ వ్యక్తిత్వాన్ని గురించీ, ఆయన ఉద్యమాల గురించీ, ఆయన భావజాలాన్ని గురించీ రాసినవే. ఈ విధంగా ఈ 118 పాటలకీ ఏకసూత్రత ఉంది. అవిధంగా ఇది 118 పాటలతో ఒక కావ్య స్ఫూర్తిని కలిగి ఉంది. పాటని ఈవిధంగా వినియోగించడం బహుశః ఈ పాటల సంకలనంలోనే జరిగి ఉండవచ్చు. ఒక ఉద్యమకారుని బహుముఖ భావజాలాన్ని వ్యాప్తిచేసే క్రమంలో ఇలాటి సమగ్రత కలిగిన పాటల సంకలనం మరొకటి కనిపించదు. ఒక మహా వ్యక్తి జీవిత విశేషాలు, సిద్ధాంతాలూ, సమకాలీన సామాజిక అంశాలతో చైతన్యవంతం చేసి, పాటల ద్వారా ప్రజల్ని మేల్కొల్పడం, ఈ పాటల సంపుటికి ప్రత్యేకతనిచ్చింది.

తెలుగు సాహిత్యంలో 'పాట'ని సాహిత్య రూపంగా గుర్తించడానికి చాలా కాలం పట్టింది. ముఖ్యంగా ఉద్యమాలే 'పాట'కి ఒక సాహిత్య ప్రక్రియా గౌరవాన్నిచ్చినై. ప్రజలలో భావాల్ని ప్రచారం చేయడానికి పాట బలమైన సాధనం. పాట రాసేవారు, భావనాశక్తి గలవారైతే ఎన్నో శిల్పాల్ని పాటలోనూ రూపొందించవచ్చు. ఎంతో సందేశాన్ని, జీవన వాస్తవికతనీ పాటలో నింపవచ్చు. స్వతహాగా కవులైనవారు, పాటల్ని అనేక విధాలుగా వినియోగించుకున్నారు. ఒక ప్రత్యేక విధానంలో బోయి భీమన్న 'పాటలలో అంబేద్కరు' అనే పాటల సంకలనంలో అంబేద్కర్ భావాల్ని వ్యాప్తి చేసే ఉద్యమం చేపట్టారు. ఈ సంకలనంలో 118 పాటలున్నై. అన్నీ అంబేద్కర్ వ్యక్తిత్వాన్ని గురించీ, ఆయన ఉద్యమాల గురించీ, ఆయన భావజాలాన్ని గురించీ రాసినవే. ఈవిధంగా ఈ 118 పాటలకీ ఏకసూత్రత ఉంది. ఆవిధంగా ఇది 118 పాటలతో ఒక కావ్య స్ఫూర్తిని కలిగి ఉంది. పాటని ఈవిధంగా వినియోగించడం బహుశః ఈ పాటల సంకలనంలోనే జరిగి ఉండవచ్చు. ఒక ఉద్యమకారుని బహుముఖ భావజాలాన్ని వ్యాప్తిచేసే క్రమంలో ఇలాటి సమగ్రత కలిగిన పాటల సంకలనం మరొకటి కనిపించదు. ఒక మహా వ్యక్తి జీవిత విశేషాలు, సిద్ధాంతాలూ, సమకాలీన సామాజిక అంశాలతో చైతన్యవంతం చేసి, పాటల ద్వారా ప్రజల్ని మేల్కొల్పడం, ఈ పాటల సంపుటికి ప్రత్యేకతనిచ్చింది.

డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ సిద్ధాంతాల ఆచరణ ప్రచారాల్లో రెండు ముఖ్యదశలున్నై. ఒకటి దళితుల్ని అన్నివిధాలా క్రమక్రమ పురోభివృద్ధి మార్గానికి తీసుకురావడం. రెండోది సమానతా సాధనకు పోరాటం చెయ్యడం. దళితుల పురోభివృద్ధికి సాహిత్యాన్ని అంకితం చేసిన వారిలో బోయి భీమన్నది విశిష్ట స్థానం. ఆయన రాసిన 'పాలేరు' నాటకం దళితులు ఉత్తమ జీవనాసక్తిని కలిగించి పురోగమన మార్గంలో నడిపించ డంలో అసమానమైన ప్రేరణనిచ్చింది. 'పాటలలో అంబేద్కర్' లోని గేయ పురోభివృద్ధి మార్గాల్ని ప్రబోధించడంలోనే కాకుండా, పోరుబాటలో నడిపించే భావాల్ని గూడా వ్యాప్తి చేస్తుంది. అంబేద్కర్ భావజాలమంతటికీ చైతన్యవంతమైన ప్రతిబింబం ఈ గేయ సంపుటి.

సంప్రదాయ ధోరణిలో ఒక మహా వ్యక్తిని గూర్చి పాట రాసే రీతి కూడా ఈ గేయాల్లో కనిపిస్తుంది. అయితే ఆ ఆరాధన భావం అంబేద్కర్ వ్యక్తిత్వం మీదనే ఆధారపడి ఉంటుంది. ఆయన చేసిన ఉద్యమాల స్పర్శతోనే కూడి ఉంటుంది. ఈ సంపుటిలోని మొదటిపాట

'జయ జయ జయ అంబేద్కర
జయ దళిత జనస్వరా!
జయ మానవమందరా!
జయ భారత భాస్కరా! అని ప్రారంభమౌతుంది.

'అంధకారమున పుట్టి
అవనికి దీపం పెట్టి
పంకమును మథించి మహికి
పరిమళమొసగిన సూరీ!!

తాను కష్టాలు పడి, అందరికీ సౌఖ్యాన్నిచ్చిన త్యాగబుద్ధిని ఈ చరణంలో పేర్కొన్నాడు. చీకట్లో తాను బాధలుపడి, లోకానికి వెలుగునందించాడు, దుర్వాసనమయమైన బురదను మథించే శ్రమను చేబట్టి, ప్రపంచానికి సువాసనల్నే పంచాడు.

'పాడుకొందునీ' అనే శీర్షిక గల పాటలో అంబేద్కర్ రాజకీయ పోరాటాన్ని స్మరిస్తూ, ప్రధానమైన రెండు సంఘటనల్ని చెప్తాడు.

'గుండ్రబల్ల సభలో నీ
గుండె చీల్చి చూపావు
పూనా ఒప్పందంలో
పురుషోత్తముడైనావు'

1930లో బ్రిటిష్ ప్రభుత్వం లండన్‌లో రౌండ్‌టేబుల్ సమావేశం జరిపింది. భారతదేశపు నిమ్న జాతుల ప్రతినిధిగా అంబేద్కర్

ఆహ్వానించబడ్డాడు. ఆ సభలో నిమ్న జాతుల తరఫున అంబేద్కర్ తన అద్భుత వాదనా పటిమను ప్రదర్శించాడు. హిందూ, మహమ్మదీయ, బ్రిటిష్ వాళ్ళు నిమ్నజాతుల్ని పట్టించుకోలేదనీ, భారతీయులకు స్వయం పాలనాధికారం వచ్చినప్పుడు వారు అధికారంలో పాలు పంచుకోవాలనీ ఉద్ఘోషించి, ఎనిమిది ముఖ్యమైన షరతులను కూడా ప్రకటించాడు. నిమ్న జాతుల తరఫున అంబేద్కర్ చేసిన ఈ కృషినే కవి' గుండె చీల్చిచూపావు' అనడం భావస్ఫోరకంగా ఉంది.

బ్రిటిష్ ప్రధాని 'కమ్యూనల్ అవార్డును' ప్రకటించగా, మహాత్మాగాంధీ అంగీకరించకపోవడంతో, కొన్ని ఒప్పందాలు అంబేద్కరుకు, మహాత్మాగాంధీకి మధ్య జరిగినై. తనకు పూర్తిగా ఇష్టం లేకపోయినా, దేశ సంక్షేమం కోసం అంబేద్కరు ఈ ఒప్పందాలకు ఒప్పుకున్నాడు. అందుకే కవి, అంబేద్కరు ఔదార్యాన్ని ప్రశంసిస్తూ, 'పురుషోత్తముడైనావు' అని ప్రశంసించాడు.

అంబేద్కరు జీవితంలోని అనేక సంఘటనలకు ఇలాగే స్థూల మైన వ్యాఖ్యానంగా బోయి భీమన్న పాటలలో రాయడం గమనించవచ్చు.

అంబేద్కరు జీవిత సంఘటనల్ని తలుచుకున్నప్పుడు ఏకీభావన పొంది రాయడం కనిపిస్తుంది. అంబేద్కరు బాల్యాన్ని గూర్చి రాసేటప్పుడు ఆ సంఘటనల్లో తానొకడుగా భావించడం హృదయాన్ని కదిలిస్తుంది. బడిలో సవర్ణ బాలురకు దూరంగా కూర్చోబెట్టిన ఘట్టాన్ని గూర్చి ఇలా రాస్తారు.

బాబా! అంబేద్కరా
బాధపడకురా
ఎచ్చట కూర్చున్ననేమి
అచ్చర మొకటేగదరా
సర్వులు సములై జీవించాలన్నది
మన మతము
మతమును తన స్వార్థానికి
మలిపెనేటి కులతత్వము
రాజసతామసగుణవా
రసులు నేటి సవర్ణులు
ఋషివై ఈ దళితులర
క్షింతువులే చింతించకు'

అంబేద్కరు తన ముందున్నట్లే భావిస్తూ, రాసిన రీతి, పాటను సజీవం చేస్తుంది.

'ఎడ్యుకేట్' అనే పాటలో, అంబేద్కర్ చెప్పిన సూక్తులన్నిటినీ ఒకచోట చేర్చి చరణాలుగా మార్చి, సందేశాత్మకంగా రాశారు. అంబేద్కర్ దళితుల అభ్యున్నతి కోసం ప్రధానంగా ఇచ్చిన నినాదం' ఎడ్యుకేట్, ఆర్గనైజ్, ఏజిటేట్' చదువుకోవడం, సంఘటితం కావడం, పోరాటం చెయ్యడం. ఈ నినాదాన్ని తీసుకుని భీమన్న ఈవిధంగా పాటలో ఇమిడ్చారు.

ఎడ్యుకేట్, ఆర్గనైజ్, ఏజిటేట్
ఎరుకపరచు, ఏకపరచు, ఎదిరించు
బోధించు సంఘటించు, పోరాడు
పోరాడక తెగవురా సంకెళ్లు
ఎవరా పలికేవారు
ఇంకెవ్వరు అంబేద్కరు

చరణాల్లో అంబేద్కరు నినాదాల్ని చెప్తూ, నాలుగు పాదాల చివర, 'ఎవరా పలికేవారు, ఇంకెవ్వరూ అంబేద్కరు' అన్న రెండు పంక్తుల్నీ పునరుక్తం చేస్తారు. ఈ పాటలోని అన్ని చరణాల్లో ముఖ్యమైన ప్రవచనాలు పాట రూపంలో చెప్పారు.

'మేకనైతే చంపుకు తింటారు అదే
సింహమైతే వినయంతో పూజిస్తారు'

మేకలా ఉండవద్దు, సింహంలా ఉండు అన్న అంబేద్కర్ ప్రబోధాన్ని కవి ఆత్మీయం చేసుకుని, ఈ సంపుటిలోని అనేక గేయాల్లో అక్కడక్కడ మళ్ళీ మళ్ళీ ఉటంకిస్తారు. ఈ పాటలోని మరో గొప్ప సందేశం–

'అడుక్కుంటే దొరికేది ఎంగిలి
అదిలిస్తే లభించేది అధికారం
పదవులలో ఏముంటది మిగిలి
పవర్ కొరకు పోరాడర నేస్తం'

సమకాలీన రాజకీయాలలో బాగా భ్రష్టమైంది ఎన్నికల విధానం. ఎన్నికలలో పాలకులను నీతినియమాల ప్రకారం ఎన్నుకునే అవకాశం పోయి, ఎన్నో ఇతరమైన అవినీతి అంశాలకు ప్రాధాన్యం వచ్చింది. బోయి భీమన్న ఈ ఓటింగ్ విధానానికి ఆవేదన చెంది, అందరికీ ఓట్లిచ్చిన అంబేద్కర్‌నే ప్రశ్నిస్తూ పాటలు రాశారు.

'అందరకు ఓట్లిచ్చినావు, రాజ్య
మఖిల జన భోజ్యమన్నావు
కూరగాయలవోలే బేరాలు సాగించి
వోట్లమ్ముకొని బ్రతుకు కోట్లాది గొర్రెలకు...
ఎడ్యుకేటెడ్ దళితులే పదవులందున్న
అజ్ఞులే తమ ప్రజలనాదుకోగలరని
కోట్లు గల ప్రభువులే వోట్లు కొనగలరనే
ఆధునిక రాజకీయ మానూహచేయవో!

'అంబేద్కరా క్షమించు! అనే పాటలో దళితులు కూడా తమ బాధ్యతను మరచిపోతున్నారనే బాధతో...

'నాయకుల పంచలలో
నాటు సారా తాగి
వొళ్లు మరిచితిమి
వోట్లు అమ్మితిమి!

అంటాడు. ఈ పరిస్థితి తప్పకుండా మారగలదని ఆశిస్తూ... భావికాల పరిణామాన్ని ఊహిస్తాడు.

'నీ ఆశ పేరాశ కాకూడదన్నా
నా తపస్సందుకేనన్నా'

అంబేద్కర్ భావజాల నేపథ్యంలో జీవితౌన్నత్యాన్ని పొంది, వక్రమార్గంలో ప్రవర్తించే వారిని గూర్చి భీమన్న ఆవేదన పొంది, కొన్ని పాటల్లో గట్టిగా వారి మార్గాన్ని ఖండిస్తారు. అంబేద్కరు వీరిని చూసి వేదన, దుఃఖం, కోసం పొందుతాడని, 'నీవొసగిన సౌకర్యాలు' అనే పాటలో మూడు భాగాలుగా రాస్తారు.

'నీవొసగిన సౌకర్యాలను పొంది
నీ పేరున పదవులు సంపాదించి
నీ ఆదర్శము మరచిన
నీచుల గని దురపిల్లే
నీ వేదన చూచి నేను
నిర్విర్ణుడునైనాను'

దళితుల అభ్యున్నతి గురించిన ఏ అంశాన్నీ వదిలి పెట్టకుండా, సమకాలీన వాస్తవికతను సమగ్రంగా ప్రతిబింబించడం చేత' పాటలలో అంబేద్కర్ గేయ సంపుటి, అంబేద్కర్ భావజాల వ్యాప్తిలో అత్యంత ప్రభావం కలిగించినదవుతోంది.

ఈ దేశంలో జరిగింది శ్రమ విభజన కాదు, శ్రామికుల విభజన' అన్నాడు అంబేద్కర్. శ్రామికులను, కులం ప్రకారం

విభజించడం ఉత్పత్తి శక్తులైన పునాది వర్గాల్ని అణచి ఉంచడమే అయింది. దళితులు ఉత్పత్తి శక్తులనీ, జాతికి సమకూర్చేవారనీ, వారిని కేటాయించి చూడరాదనీ బోయి భీమన్న ఈ సంకలనంలోని అనేక గేయాల్లో బలంగా చెప్తారు. 'దళితులపై' అనేక పాటలో చాలా సూటిగా, సరళంగా, ఈ అంశాన్ని వ్యక్తీకరించిన రీతి ప్రశంసనీయం.

'దళితులపై కులం పేర దండెత్తుకురా
నిదురించే సింహాలను కదలించకురా-
దళితులనగ నెవరునీ దాయాదులురా
విడిపోయిన వారు, వెనుకపడినవారు-
జాతికి సంపద గూర్చే శ్రమ జీవులు దళితులు
దేశ సమగ్రతకు జీవ దీపాలే దళితులు
దీపాలను ఆర్పుకోకురా వేద
దేవి బ్రతుకు చీకటి చేయకురా
బహుజనులను వెలిబెట్టి బ్రతుకజాలదే జాతి'

శ్రామికతత్వాన్ని వర్ణ దృష్టితోనే కాకుండా, పరిధి విశాలమై వర్గ దృష్టితో కూడా పరిశీలించిన పాటల్ని బోయి భీమన్న ఎన్నో రాశారు. ఆర్థికంగా దోపిడీ చేస్తూ, పేదరికాన్ని పెంచే వర్గాల మీద తన క్రోధాన్ని ప్రకటిస్తారు. 'డబ్బు డబ్బు డబ్బు' అనే పాట ఇందుకొక ఉదాహరణ.

'డబ్బు డబ్బు డబ్బు ఎవ
డబ్బ సొమ్ము డబ్బు'
కార్మికులది డబ్బు
కర్షకులది డబ్బు-
కార్మికులకు కాకుండా కర్షకులకు లేకుండా
అధికంగా ఎవడి వద్ద డబ్బుంటే
అతడు ఆర్థిక దొంగ -
లంచాలూ, దొంగలాభాలూ
వ్యాపారపు మాఫియాలు
హత్యా రాజకీయాలు
డబ్బా! అదికాదయ్యా
జబ్బయ్యా జాతికి -'

ప్రపంచంలో ఏ హృదయ వాదియైన మేధావీ, తత్తవేత్త ఇంకా కళ్లు తెరవకముందే, భారతదేశంలో పుట్టిన బుద్ధుడు, సర్వమానవ సమానత్వానికి సంబంధించిన తత్వాన్నీ, మానవ దుఃఖాన్ని నిర్మూలించే సూత్రాన్నీ నిండుగా ప్రభావితం చెయ్యగలిగాడు. భౌతికంగా మానవులందరి మూల చైతన్యాన్నీ అర్థం చేసుకున్న మానవోత్తముడు కాబట్టే, భారతదేశంలోని కుల నిర్మూలన ఉద్యమానికి పటిష్టమైన బీజం వెయ్యగలిగాడు. అందుకే అంబేద్కర్, బుద్ధుని సిద్ధాంతాల్ని అనుసరించి, తన విప్లవాన్ని కొనసాగించాడు. ఈ సిద్ధాంతం పై బోయి భీమన్నకు చాలా గౌరవం ఉంది. అందుకే, ఈ సంపుటిలోని పాటల్లో ఎన్నోచోట్ల బుద్ధుని ప్రస్తావన వస్తుంది. బుద్ధుని భావాల్ని ఆర్థిక రాజకీయాలకి అన్వయించి, ప్రచలితం చేసినవారుగా, అంబేద్కర్‌ని ప్రశంసిస్తారు. దళితోద్ధరణకి జీవితం అంకితం చెయ్యడమే గాకుండా, అసలు కులాన్నే నిర్మూలించాలన్నది అంబేద్కర్ నినాదం. కులం పునాదుల మీద ఒక సమాజాన్ని నిర్మించడం సాధ్యం కాదని ఆయన అన్నారు. బోయి భీమన్న 'కుల భేదములు' అనే పాటలో ఈ భావాల్ని శక్తివంతంగా వెలిబుచ్చారు.

'కుల భేదములున్నంత కాలము
కుల పోరాటాలే తప్పవురా
కుల పోరాటాలే తప్పాలంటే
కుల నిర్మూలనే మార్గం రా-
కుల నిర్మూలన హిందూమతమున
కలలో మాటనుకుంటే
భారతీయులందరును మొత్తముగ
బౌద్ధులగుట క్షేమమురా-
ఎప్పుడో బుద్ధుడు చెప్పిన మాటిది
ఇప్పుడు అంబేద్కరు మరలా చెప్పెరా!

సమాజం కోసం కులం వద్దని చాలామందిలో ఈనాడు కుల భావన ఉంది. ఈనాటి ఓటు రాజకీయాల్లో కులానిదే ప్రధాన పాత్ర. అందుకే అందరూ బుద్ధమతానుయాయులైతే కులం నిర్మూలింపబడుతుందని కవి అభిప్రాయం.

దళితుల నుండి, శ్రామికుల నుండి, నిరుపేదల నుండి, ఒక తిరుగుబాటు రావాలనే భావాన్ని బోయి భీమన్న, చాలా పాటల్లో తీవ్రంగా చెప్తారు. వీరి పక్షం నుండి ప్రతిఘటన లేని విధంగా, శాంతి నినాదాలు వల్లించేవారు మోసగాళ్లు అంటాడు కవి. సంఘర్షణ అవసరమైన చోట సంఘర్షిస్తేనే, శాంతి సాధ్యమవుతుంది. ఈ తత్వాన్ని 'ఘజినీలకు' అనే పాటలో ఇలా చెప్తాడు.

'శాంతి నినాదము సాధు
జంతు ఆర్తనాదములు
గోవ్యాఘ్ర కథానికలు
కుక్షింభర కవులవిరా
పరువుగ బ్రతకాలంటే
పౌరుషమే మార్గమురా-
బ్రతుకు తెరువు ఏదైనా
పోరుడవందరివలనే
పరువెత్తిన తరుమువాడె
తిరగబడిన పారిపోవు
మానవ స్వభావమెరిగి
మంచిగా జీవింపరా-'

అంబేద్కర్ ప్రధాన సందేశం, అన్ని భేదాలూ పోగొట్టుకుని భారత జాతి మొత్తం ఒక జీవన విధానాన్ని అనుసరించాలనేదే 'భారతీయత' అనే గొప్ప దృక్పథాన్నిచ్చిన వారిలో అంబేద్కర్ మహోత్తముడు. ప్రస్తుత కాలంలో ఈ దేశాన్ని ఈ దేశం కాకుండా చేసే సామ్రాజ్యవాద నేపథ్యంలో, భారతీయతకంటే గొప్ప దృక్పథం లేదు. ఇదే అస్తిత్వవాదాల్లో సమకాలీనతకు ప్రతిబింబం. బోయి భీమన్న పాటల్లో ఈ భారతీయత పదే పదే పునరుక్తమౌతుంది. భారతీయత కోరడం వల్లనే అంబేద్కర్ బౌద్ధమతాన్ని స్వీకరించాడు. దీన్ని గురించి భీమన్న ఇలా చెప్తారు.

'పరమతాలనన్నిటినీ పరిశోధించిన అంబే
ద్కరు బౌద్ధమునే ఎన్నిక చేసెను
అంబేద్కరు కంటే మన
కధికం తెలుసా సోదరా!

# నానీలు

- రంగనాథ్



దృశ్యం లోపలికి
దుఃఖం వెలుపలికి
'కన్ను' అంటే
అదే సార్!

కొలను నీళ్ళు
ఆవిరై పోయాయి
కొత్త జంట
జలకాలాడింది మరి!

అందం చందం
పద్యం బాగుంది
హృదయానికి
తాకలేదేమిటి?

---

అస్పృశ్యత, కుల జాఢ్యం
అంతరించిపోతే, భా
రతీయమే ప్రబుద్ధమై
క్షితినే పాలించదటరా–'

'ప్రబుద్ధమై' అనడంలో మేల్కొనడమనే అర్థముంది. బౌద్ధ ధర్మమే భారతీయతను నిలిపి, ప్రపంచానికే ఆదర్శమౌతుందనే ధ్వని ఉంది.

'అంబేద్కరిజమ్ అంటే' అనే పాటలో, అంబేద్కరిజమ్‌లోని అత్యంత కీలకమైన సందేశాన్ని సూటిగా చెప్తారు బోయి భీమన్న.

'అంబేద్కరిజమంటే
ఇండియనిజమే!
ఇండియనిజమంటే పౌరు
లెల్లరొకటె అను నిజమే!
ఇండియాలో పుట్టి పెరుగు
ఎల్లరు ఇండియనులే
కులం మతం పేరు చెప్పు
కొని బ్రతుకుట నేరం!...
కుల పోరాటాలు వద్దు
కులములెవద్దు
స్వచ్ఛమైన మానవ సౌ
జన్యమే అంబేద్కరిజమే'

అంబేద్కర్ మానవతా దృక్పథాన్ని, సమకాలీన హింసాత్మక సమాజానికి అన్వయిస్తూ, బోయి భీమన్న ఆచరణీయమైన మానవత్వాన్ని గూర్చి, సాధారణీకరణ చేస్తూ, సరళమైన నినాదాల్ని, 'బ్రతకగల్గిన చాలు' అనే పాటలో హృదయానికి తగిలే రీతిలో అందిస్తారు.

'బ్రతకగల్గిన చాలు మనిషి,లోక
బాంధవుడె అవుతాడు మనిషి
ఒకరికొకరు గిల్లి కజ్జాలు పడకుండా
ఒకరికొక్కరు దోచుకోకుండా
ఒకరికొక్కరు త్రోచుకుని బోర్లాపడకుండా
ఒకరికొక్కరు చంపుకోకుండా–
మనిషి మనిషిని చేరి వంచించకుండా
మనిషి మనిషిని నమ్మి చెడకుండా
మనిషి మనిషితో కూటికై పోటీపడకుండా
మనిషి దారికి మనిషి అడ్డుపడకుండా!

పాటకి 'పల్లవి' తిలకం లాంటిది. సరైన దారిలో వేసే మొదటి అడుగులాంటిది. ఇది దారిలో ముందడుగులు వేసి, ఎక్కడ ఆగుతుందో, అది మొదటి అడుగుకి తగిన మజిలీ కావాలి. కేవలం పాడుకొనే పాటకంటే, చదువుకున్నా ఒక స్ఫూర్తి కలిగించే పాటకి ఈ లక్షణం, చాలా శక్తినిస్తుంది. బోయి భీమన్నగారి పాటలలోని పల్లవులు, పాటలోని భావాల స్ఫూర్తిని నినదిస్తూ బలమైన ఉటంకింపులు (కొటేషన్లు)గా ముద్రవేస్తై. ఉదాహరణకి కొన్ని –

'శిష్టులనీ దుష్టులనీ
జీవులు రెండే వర్గములు
శిష్టుల రక్షించుట దైవీయం
దుష్టుల దండించుట కర్తవ్యం'
'తనదన్నది లేనివాడు
మనుజులలో లెక్కకాడు'
'మతము కోరినంతనే
వెతలు తీరిపోవునా
ఆత్మబలము చూపక
ఆర్తి తొలగిపోవునా'
'పుట్టిన ప్రతి మనిషీ భూమి పుత్రుడే
భూమాతను సేవించే మహితచిత్తుడే'
'మతమేదో ఉంటుంది మనిషికి, ఏ
మతమైనా ఒకటేరా మనీషికి।
'దళితులనుద్ధరించి ధర్మంకుంటిది'
'నాకొక దేశం కావాలి, నాదొక జాతిగా నిలవాలి'

పాటలోని సారాన్ని పూర్తిగా మోసే కొన్ని ముగింపులు కూడా గమనించవలసినవి.

'మహరంటే మహాహరుడా
అహంబుద్ధ సిద్ధార్థుడా'
'కర్షకుడే భూమాతకు ప్రథమ సేవకుడు
కృషి ఫలమున తొలి వాటా ఆతడిదే'
'విజయం కావాలంటే
వీరవహ్ని రగలాలి'
'ఏకజాతి నిర్మాతవు
నీకు సాటి ఎవరయ్యా'

పల్లవి, చివరి చరణాల మధ్య పాటలోని భావాలన్నీ సముచిత రీతిలో విస్తరించుకొంటాయి.

బోయి భీమన్న పాటలు పాడుకున్నా, చదువుకున్నా ఉత్తేజం కలిగిస్తై. సూటిగా చెప్పే సూత్రాలు, సరళంగా ప్రబోధించే సిద్ధాంతాలూ, జన సామాన్యంపై ముద్రవేసే సారళ్యమూ, పాటలలో అంబేద్కరు సంకలనాన్ని ప్రయోజన వంతం చేస్తున్నాయి. పాటలలో అంబేద్కరు, బోయి భీమన్నగారి ఒక ప్రత్యేకమైన ఉపలబ్ధి. ■

కథ

# ప్రజాస్వామ్యమా వర్ధిల్లు

- అనసూయ



**ఎలక్షన్ ఆర్డర్ అందుకోగానే గుండాగినంత పనయ్యింది జ్యోతిర్మయికి. దేనికోసమైతే నెల రోజుల్నుండి ఎలక్షన్ నోటీస్ వచ్చిన్నాటి నుండి భయపడుతుందో అది రానే వచ్చింది. ఉద్యోగంలో చేరి సంవత్సరం కూడా కాలేదు. ఏడాది నిండని ఇద్దరు కవల పిల్లలు. భర్తకు వేరే ఊర్లో ఉద్యోగం. ఎక్కడో మారుమూల పల్లెటూర్లో డ్యూటీ. తలుచుకుంటేనే ఒళ్ళంతా చెమటతో తడిసిముద్దయింది.**

హెడ్‌మాస్టారు దగ్గరకు వెళ్ళి డ్యూటీ కాన్సిల్ చెయ్యమని బ్రతిమాలింది. "నా చేతిలో ఏమీ లేదమ్మా, పంపమన్నట్లు పేర్లు పంపించకుంటే నా మీద యాక్షన్ తీసుకుంటారు. అందుకే ఉన్నయి ఉన్నట్లు పేర్లు పంపించాను. ఇప్పుడు డ్యూటీ కాన్సిల్ చెయ్యడం నా చేతుల్లో లేదు. కావాలంటే ఎమ్మార్వోని కలిసి నీ సమస్య చెప్పుకో ఆయన తలుచుకుంటే డ్యూటీ కాన్సిల్ అవుతుంది" అన్నాడు హెడ్ మాస్టరు.

ఆర్డరు పట్టుకొని ఎమ్మార్వో ఆఫీసుకు వెళ్లింది జ్యోతిర్మయి.

"సర్ ఇంట్లో ఇద్దరు చిన్నపిల్లలు, చూసే వాళ్ళెవరూ లేరు. నా డ్యూటీ కాన్సిల్ చెయ్యండి" అంటూ మొర పెట్టుకుంది సూపరింటెండెట్‌తో.

"అందరూ ఏదో ఒక సాకు చెప్పి డ్యూటీలు కాన్సిల్ చెయ్యమంటె ఇంక డ్యూటీలు ఎవరు చేస్తారమ్మా! ఇది ఎలక్షన్ కమిషన్ ఆర్డర్, డ్యూటీ చెయ్యకపోతే యాక్షన్ తీవ్రంగా ఉంటుంది. అరెస్టు కూడా చెయ్యొచ్చు. అయినా ఉద్యోగాలన్నాక ఇలాంటి డ్యూటీలు లేకుండా ఎలా వుంటాయి" అన్నాడు మందలింపుగా.

ఎమ్మార్వోని కలిసి పరిస్థితి చెప్పి బ్రతిమాలింది.

"నో...నో... అలా కుదరదు" అన్నాడు ఎమ్మార్వో కఠినంగా, ఈ పైరవీలు, ప్రాథేయపడటాలకంటే డ్యూటీ చెయ్యడమే నయం. అనుకుంటూ డ్యూటీకి వెళ్లడానికి మెంటల్‌గా ప్రిపేరవసాగింది జ్యోతిర్మయి.

మర్నాడు ఎలక్షన్ క్లాసు. సిన్సియర్‌గా తొమ్మిదింటికే వెళ్లింది జ్యోతిర్మయి. ఎవ్వరూ రాలేదప్పటికి. అప్పుడే కుర్చీలు మైకు సెట్లను దింపుతున్నారు.

పదకొండవుతుండగా వచ్చారు ఎమ్మార్వో ఆఫీసు సిబ్బంది. హ్యాండు బుక్కూ, ప్రింటౌట్స్ ఇచ్చారు. పన్నెండున్నరకు ఆర్డీవో వచ్చి క్లాసు తీసుకున్నారు. ఇవిఎమ్ ఎలక్ట్రానిక్ ఓటింగ్ మిషన్స్‌ను తొలిసారిగా మన దేశంలో జనరల్ ఎలక్షన్స్‌లో ఉపయోగిస్తున్నందున మిషన్‌ను ఉపయోగించే విధానం, పనితీరు, తీసుకోవలసిన జాగ్రత్తలు మెళుకువలు, టెండర్ ఓట్లు, చాలెంజ్‌డ్ ఓట్లు పీవో పాత్ర, ఎదుర్కోవాల్సి వచ్చే సమస్యలు రెండు గంటలసేపు అనర్గళంగా చెబుతూనే మధ్య మధ్య పవర్‌పాయింట్ ప్రజెంటేషన్‌లో ఇవిఎమ్ పనితీరును చూయించారు. అసలే మైకు గర గర శబ్దం. రీ సౌండ్, ఎవరి గోలలో వాళ్లున్నారు. ఎవరూ శ్రద్దగా వింటున్నట్టు కన్పించలేదు. వచ్చేవాళ్ళు

వస్తూ వెళ్లేవాళ్లు వెళ్తూనే ఉన్నారు. ఆర్డీవో వెళ్లగానే ఎమ్మార్వో మళ్లీ ఒకసారి ఇవిఎం పనితీరును చూయించారు. ఇవిఎం రెండు పార్టులుగా ఉంటుందని, మొదటి భాగాన్ని కంట్రోల్ యూనిట్ అని రెండవ భాగాన్ని బ్యాలెట్ యూనిట్ అంటారని, బ్యాలెట్ యూనిట్‌లో బ్యాలెట్ పేపరు ఫిక్స్ చేసి ఉంటుంది. ప్రతి అభ్యర్థి పేరు, గుర్తు ఎదురుగా ఒక బటన్ ఉంటుంది. ఓటరు తన రహస్య కంపార్ట్‌మెంట్‌లోకి వెళ్ళి అభ్యర్థి గుర్తుకు ఎదురుగా ఉన్న బటన్‌ను ప్రెస్ చెయ్యాలి. గ్రీన్ లైట్ వెలిగితే ఓటు వెయ్యడానికి రెడీగా ఉన్నట్టు గుర్తు రెడ్‌లైట్ ఓటు వేసిందానికి గుర్తు. ఓటు పడగానే బీప్ సౌండ్ వస్తుంది. బటన్‌లు ప్రెస్ చేసి చూయిస్తూ వివరించాడు ఎమ్మార్వో.

ఓటింగ్ ప్రారంభించే ముందు మిషన్ క్లియర్ చేసి ఏజెంట్లకు చూయించి వాళ్ళ చేతే మాక్ ఫోల్ వేయించి తిరిగి క్లియర్ చెయ్యాలి. ఏజెంట్ల సంతకాలు తీసుకొని మిషన్‌ను సీలు చెయ్యాలి.

అంతా మిషన్లను ప్రాక్టీస్ చెయ్యడం మొదలుపెట్టారు. బీప్ సౌండ్స్‌తో హాలంతా మారుమ్రోగి పోతున్నది. సన్నగా తలనొప్పి మొదలయింది జ్యోతిర్మయికి. ఇక భరించలేననుకుంటూ బయటపడింది.



రెండో క్లాసుకు పదిగంటలకైతే ఓ అరగంట లేటుగానే వెళ్లింది. వెళ్లగానే సంతకాలు చేయించుకొని రెండు ట్రెనింగ్ క్లాసులకుగాను రెండొందలు ఇచ్చారు. చాలామంది డబ్బులకొరకే వచ్చినట్లు డబ్బులు తీసుకొని వెళ్లిపోతున్నారు. పోస్టలు బ్యాలెట్లు అడిగి తీసుకుంటున్నారు కొందరు. బయట ఓ దగ్గర గుంపుగా నిలబడి మాట్లాడుతున్నారు కొందరు. తర్వాత ఎవరో చెప్పారు. పోస్టలు బ్యాలెట్లు సంతకం చేసి ఇస్తే పదిహేను వందలు ఇచ్చిండ్రని.

ఒకవైపు మైకులో ఓటింగు విధానం గురించి ఉపన్యాసం సాగుతూనే ఉంది. చివరగా జాయింట్ కలెక్టరు వచ్చి మనమంతా ఒక గొప్ప పవిత్ర కార్యమైన ప్రజాస్వామ్య పరిరక్షణలో భాగస్వాములమౌతున్నామని, ప్రతి ఎలక్షన్ పర్సన్ కూడా ఈ బాధ్యతను అత్యంత జాగ్రత్తగా నిర్వహించాలని చెప్పారు.

జ్యోతిర్మయి అధికారులు చెబుతున్న ప్రతి విషయాన్ని జాగ్రత్తగా వింటూ నోట్ చేసుకుంది. హ్యాండ్‌బుక్‌లో ముఖ్యమైన విషయాలను అండర్‌లైన్ చేసుకుంది. ఎలక్షన్ అధికారుల ఫోను నెంబర్లు రాసుకుంది. అసలే తనకు ఈ పని కొత్త... అందునా తనది ప్రిసైడింగ్ ఆఫీసరు డ్యూటీ. క్లాసు ముగిసింది.

ఆ రాత్రంతా హ్యాండు బుక్ శ్రద్ధగా చదివింది. ఒక డబ్బా తీసుకొని ఈవిఎం మీద ప్రాక్టీస్ చేసినట్లుగా సీలు చెయ్యడం క్లోజ్, రిజల్ట్, క్లియర్ బటన్లు నొక్కడం ఓటు వేయడం ప్రాక్టీస్ చేసింది. పిల్లలు ఆసక్తిగా తల్లి చేసే పనులను కళ్ళు విప్పారించి చూశారు. జ్యోతి భర్త శ్రీకాంత్ మాత్రం పడీపడీ నవ్వాడు. "కొత్త బిచ్చగాడిలా ఈ ప్రాక్టీస్ ఏంటి" అంటూ..

"అవును మీకేం అలాగా నవ్వుతారు. మీరు డ్యూటీ చేస్తే తెలిసేది. రేపేదైనా తేడా వస్తే కోర్టు చుట్టూ తిరగాలట" అంది ఉక్రోషంగా. ఎలాగైతేనేం వెళ్లాల్సిన రోజు రానే వచ్చింది. ప్రొద్దున్నే ఇంటి పనులన్ని ముగించి పిల్లల్ని ఆడబిడ్డ ఇంట్లో ఉంచి బ్యాగులో రెండు జతల బట్టలు, బాక్సుల్లో పులిహోర, పెరుగన్నం సర్దుకుంది. ముందురోజే రెండురోజులు ఉండటానికి కావలసిన చిన్న చిన్న వస్తువులన్నీ ఓ పాలిథిన్ కవర్లో పెట్టుకుంది. ఎందుకైనా మంచిదని ఓ బ్రెడ్డు ప్యాకెట్ జామ్ బాటిల్ కూడా తెచ్చిచ్చాడు శ్రీకాంత్. తనొచ్చేవరకు పిల్లలు ఎలా ఉంటారో అన్న దిగులుతోనే బస్టాండుకు చేరింది.

బస్సు నిండా ఎలక్షన్ డ్యూటీలో వెళ్తున్న వాళ్ళే. సీటు దొరకలేదు. ఒంటికాలిపై నిలబడింది జ్యోతిర్మయి. మిర్యాలగూడలో కొందరు దిగిపోయారు. ముందు సీటు ఖాళీ అయితే కూర్చుంది. తన స్కూల్లో టీచర్లందరికీ దగ్గర దగ్గరగానే పడింది. తనకొక్కదానికే ఇలా విసిరేసినట్లు ఎక్కడో దూరంగా మారుమూలన పడింది. దిగులు దిగులుగా ఆలోచిస్తుంది జ్యోతిర్మయి. మరో రెండు గంటల తర్వాత కోదాడ బస్టాండుకు చేరుకుంది. రిసీవింగు సెంటర్‌కు చేరుకోవడానికి ఓ కిలోమీటరు దూరం నడవాలి. మరో నలుగురు టీచర్లు పరిచయమయ్యారు. ఎలక్షన్ జీపులు ఖాళీగా వెళుతున్నాయి. చెయ్యి చూపించినా ఒక్కరూ ఆగడం లేదు. టీచర్లంటే అందరికీ లోకువే.

రిసీవింగ్ సెంటర్ ఏర్పాటు చేసిన మిషనరీ స్కూలు పెద్దింటి పెళ్లిళ్లలా ఆవరణంతా షామియానలతో, నీళ్ల డ్రమ్ములు వంట ఏర్పాట్లతో సందడిగా ఉంది. పిల్లల రిజల్టు పెట్టినట్లు, ఆర్డర్లు అలాట్ చేసిన పిఎస్‌ల పేర్లు గోడల నిండా అతికించి వున్నాయి. అందరూ గుంపుగా ఎగబడడంతో ఆడవాళ్లు ఆ గుంపులో వెళ్లలేక వెనక్కి జరిగారు. చాలామంది పేర్లు లిస్టులో కనబడలేదు. జ్యోతిర్మయి పేరు కూడా లేదు.

పేర్లు లేనోళ్ళంతా దయాస్‌కు ఎడమవైపున్న కుర్చీల్లో కూర్చోవాలి అంటూ అనౌన్స్ చేశారు. ఆర్డర్లు ఉన్నవాళ్లు వచ్చి తమకు కేటాయించిన కౌంటర్లలో సామాను తీసుకోవాలని చెబుతున్నారు.

పివోలు, ఎపివో కలిసి వచ్చి మెటీరియల్ తీసుకోవాలని చెప్పడంతో, పివోలకు ఏపివోలు, ఏపివోలకు పివోలు తెలియక వీళ్లొచ్చినప్పుడు వాళ్ళు, వాళ్ళొచ్చినప్పుడు వీళ్ళు రాక.. దొంగ పోలీసు ఆటలాగా సాగింది ఆ కార్యక్రమం. ఇద్దరు పరస్పరం కలువగానే ఆత్మీయులు కలిసినంత ఆనందంగా వచ్చి ఎలక్షన్ మెటీరియల్ తీసుకున్నారు. తీసుకున్న సామాన్లు చెక్‌లిస్టుతో సరిచూసుకోవడం కొరకు ఎక్కడపడితే అక్కడ సామానంతా పరుచుకుని కూర్చున్నారు. రాని సామాన్ల కొరకు కౌంటర్ల చుట్టూ తిరుగుతున్నారు. ఈ కార్యక్రమం పూర్తయ్యేసరికి సాయంత్రం నాలుగయ్యింది. ఆ తర్వాత గోడ మీద పేర్లు లేనోళ్లను పిల్వడం మొదలుపెట్టారు. జ్యోతిర్మయిని పిలిచి ఆర్డరు చేతిలో పెట్టారు. ఆ పిఎస్‌కు వేసిన ఎపివో సంతోషంగా వచ్చాడు జ్యోతిర్మయి దగ్గరకు. అమ్మయ్య... రండి మేడం మెటీరియల్ తీసుకుందాం... మీరు రాకపోతే నన్నెక్కడ పివో డ్యూటీ చెయ్యమంటారో అని హడలి చచ్చాను అన్నాడతను. హడావిడిగా మెటీరియల్ చెక్ చేసుకొని మరల మూటలు కట్టి కౌంటర్లో పెట్టేటప్పటికి రాత్రి తొమ్మిదయింది. ఈ రాత్రికి ఎక్కడుండాలి ఈ ఊళ్లో తనకు తెలిసిన వాళ్లు కూడా లేరు. మిగతా తోటి టీచర్లు వాళ్ళ వాళ్ళ దార్లు వాళ్లు చూసుకుంటున్నారు.

నేను పొద్దున్నే వస్తా మేడం అంటూ మాయమయ్యాడు ఏ.పి.వో. ఆఖరికి ఎలక్షన్ అధికారులే రాత్రి ఉండిపోయే ఆడవాళ్ళ కొరకు ఒక రూమ్ కేటాయించారు. జ్యోతిర్మయికి చికాగ్గా ఉంది. పొద్దుట్నుండి యూరినల్స్‌కు కూడా వెళ్ళలేదు. కడుపు బిగబట్టినట్లుంది. ఆకలి, నీరసం, తలనొప్పి. ఎలాగోలా స్కూల్ వెనకాల ఉన్న టాయిలెట్‌కి

వెళ్లి వచ్చి డ్రమ్ముల్లో ఉన్న నీళ్లతో మొహం కడుక్కుంది. పొద్దున బాక్సులో తెచ్చుకున్న పెరుగన్నం రెండు ముద్దలు తిని దుప్పటి కప్పుకొని ఓ బెంచీమీద పడుకుంది. పిల్లలు గుర్తొచ్చారు.

శ్రీకాంత్ వచ్చాడో, లేదో. పిల్లలు ఎలా ఉన్నారో ఇద్దర్ని సముదాయించలేక ఆడపడుచు విసుక్కుంటుందేమో... రాత్రంతా కళ్లు మూసుకున్నా నిద్రరాని స్థితిలోనే గడిచిపోయింది.

పొద్దున్నే లేచి మొహం కాళ్లు చేతులు కడుక్కొని చీర మార్చుకుంది ఏపివో రాలేదు. అతడు వస్తే పంపిస్తాం మీరు వచ్చి ఎవిఎమ్‌లు తీసుకొమ్మని అన్నారు అధికార్లు. రూట్ బస్సు రెడీగా ఉంది.

మిషన్ తీసుకొని చెక్ చేస్తే స్టక్ అయి ఎంతకూ ఓపెన్ కావడం లేదు. టెక్నిషియన్ వచ్చి రిపేరు చేశాడు. ఏదైనా ప్రాబ్లమ్ వస్తే మేం వచ్చి రీప్లేస్ చేస్తాం అన్నారు నోడల్ ఆఫీసర్. వచ్చి బస్సులో కూర్చుంది. ఇద్దరు పిసిలు రాలేదు. బస్సు బయలుదేరుతుండగా వచ్చాడు ఏపివో అరగంట ప్రయాణం తర్వాత పెద్ద శబ్దంతో బస్సు ఆగింది. అంతా బిలబిలా దిగారు. టైరు పంక్చరైందట, అన్నారెవరో "వచ్చేటప్పుడు ఆంజనేయస్వామి గుడి దగ్గర ఆగి కొబ్బరికాయ కొట్టి రావలసింది" అన్నదో లేడీ టీచరు.



డ్రైవరు మరికొంతమంది కలిసి టైరు మార్చారు. మళ్ళీ బస్సు బయల్దేరింది. ఒక్కొక్క ఊర్లో పోలింగు అధికార్లను మెటీరియల్‌ను దించి మళ్లీ రివర్స్ తీసుకొని బయలుదేరుతున్నది బస్సు.

ఒక ఊర్లో ఇరుకు సందులోంచి వెళ్లిన బస్సు రివర్స్ చేస్తుండగా ఓ దబ్బా కొట్టుకు గుద్దుకుంది. దబ్బా రేకులు ఓ పక్కకు ఒరిగినయ్. డామేజి కట్టియ్యకుండా బస్సు కదిలేది లేదంటూ గొడవకు దిగారు ఆ కొట్టువాళ్లు. జోనల్ ఆఫీసర్ వచ్చి ఊరి సర్పంచుతో హామీ ఇప్పిస్తే గాని బస్సును కదలనివ్వలేదు. ఆఖరి ఊరు జ్యోతిర్మయిది. ఊరి చివర ఉన్న మొండిగోడల బడిలో పోలింగు స్టేషను. నాలుగు గోడలు, కప్పు ఉన్న గది ఒక్కటే తాళం వేసి ఉంది. చుట్టుపక్కల ఎవ్వరు లేరు. బస్సు చూసి చిన్న పిల్లలు గుమిగూడారు. మస్కూరిని పిలవండిరా... విలేజీ సెక్రటరీ ఎవ్వరు? అని గదమాయిస్తే చూడ్డానికి వచ్చిన ఒక గ్రామస్తుడు పోయి మస్కూరిని పిలుచుకొచ్చాడు. బడి తాళం తీసి ఇవిఎంలు, ఇతర సామాన్లు ఉన్న గోనెబస్తాలు లోపల పెట్టారు. అప్పటికే చీకట్లు ముసురుకుంటున్నయ్. బడిల కరెంట్ లేదు. బడి ఆవరణలో వున్న చేదబావిలోంచి నీళ్ళు తోడుకుని మొహాలు కడుక్కున్నారు. ఊరిబయట ఉండడం వల్ల టీ కూడా దొరికేటట్టు లేదు. పొద్దుట్నుండి టీ తాగకపోవడం వల్ల తలనొప్పి దంచేస్తున్నది. తలా యాభై రూపాయలు ఇచ్చి భోజనం ఏర్పాట్లు చెయ్యమని మస్కూరిని పురమాయించారు. ఊర్లో నుంచి ఓ పెద్దమనిషి వచ్చి ప్రక్క నుంచి కరెంటు తీగల నుండి వైరు లాగి పెట్టారు. రెండు పోలింగ్ స్టేషన్లున్నాయి ఆ బడిలో. జ్యోతిర్మయి ఆ మసక వెలుతురులోనే సంచి విప్పి ఫామ్స్ కవర్లు తీసి అడ్రసులు రాయడం మొదలు పెట్టింది.

'అమ్మా మీరు ఈ బడిలో చెప్పే వసంత టీచరు ఇంట్లో పడుకోండమ్మ మొగోళ్లంత ఈడ్నే పడుకుంటారు' అన్నాడు మస్కూరి.

'అట్ల కుదరదు. ఇవిఎంలు ఎక్కడుంటే మేడమ్‌గారు అడ్నే ఉండాలే లేకపోతే మేం సెక్యూరిటీ ఇవ్వలేం' అన్నారు పోలీసులు.

'పోనీలెండి నేను కూడా ఇక్కడ్నే పడుకుంటా' అన్నది జ్యోతిర్మయి. పులినోట్లో తలపెట్టినంక చావో రేవో ఎదుర్కోవాల్సిందే కద అనుకున్నది మనసులో. ఈ రాత్రి ఎట్లా గడుస్తుందా అని భయపడుతూనే.

ఉక్కపోత, దోమలు కొత్త చోటు ఎక్కడ్నుంచో కుక్కల అరుపులు భయంతో అలా కళ్లు తెరుచుకొనే ఉండిపోయింది జ్యోతిర్మయి. చీకట్లోనే లేచి మొహం కడుక్కుని బట్టలు మార్చుకుంది. అయిదున్నరకల్లా పోలింగుకు కావలసిన ఏర్పాట్లు మొదలుపెట్టింది.

ఆరున్నర అయింది ఏజెంట్లు ఎవ్వరు రాలేదు. అయిదు నిమిషాలు తక్కువ ఏడుకు పదిమంది ఏజెంట్లమంటూ వచ్చారు. సంతకాలు వెరిఫై చేసి ఏజెంటు పాసులిచ్చి మాక్ పోల్ చేసి చూయించారు. మిషన్ సీలు చేసి మొదటి ఓటు వేసేంతలో ఒక ఎంపీ కాండిడేట్ ఏజెంట్ వచ్చాడు. మల్ల మాక్‌పోల్ చెయ్యాలన్నాడు. అతనికి సర్దిచెప్పి పోలింగ్ ప్రారంభించేటప్పటికి ఏడున్నర. బయట క్యూ పెరిగిపోయి గొడవ గొడవగా ఉంది. గంటసేపు ముమ్మరంగా పోలింగు. పివోడైరీలో నోటు చెయ్యడం, అన్నీ పనులను పర్యవేక్షించడం, ఏజెంట్లను ఓ కంట కనిపెట్టడం ఇవిఎం కంట్రోల్ యూనిట్‌ని ఆపరేట్ చెయ్యడం, మధ్య మధ్య కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు, మంచం మీద నుండి లేవలేని వాళ్ళు వచ్చినప్పుడు, కంపానియన్ డిక్లరేషన్ అదీ ఎందుకమ్మా... మీరెళ్లి వేయించండి. మేమందరం చెబుతున్నాం కదా, అన్నారు ఏజెంట్లు ఓ గంట పోయాక బయట నుండి కొందరు వచ్చి ఏం పంతులమ్మా అన్ని ఓట్లు నీవే గుద్దుతున్నవంటగా అన్నారు. పొద్దుపొయ్యేకొద్దీ తప్పతాగి తూలుతూ వస్తున్న ఓటర్లు, బయట కొట్లాటలు, మధ్యలో ఇవిఎంల మొరాయింపు, మొత్తం మీద పోలింగ్ ఘట్టం ముగిసింది. వెళ్లేటప్పుడు వీళ్ళదే మొదటి స్టేషను కాబట్టి, ఏదన్నా ఉంటే అక్కడికెళ్ళాక చేసుకోవచ్చు పదండి పదండి అంటూ తొందరపెట్టారు రూట్ ఆఫీసరు. రిసీవింగ్ సెంటర్ చేరేటప్పటికీ రాత్రి పది. ఇవిఎంలు ఇచ్చే దగ్గర చాంతడంత క్యూ. సీల్డు కవర్లు ఒకచోట స్టాచుటరీ కవర్లు ఓ చోట నాన్ స్టాచుటరీ ఇంకో చోట. అన్ని అప్పగించి రెమ్యూనరేషన్ కొరకు మరో క్యూలో నిల్చున్నది జ్యోతిర్మయి. నాలుగు రోజులు డ్యూటీ చేస్తే రెండురోజులకే డివి ఇస్తున్నారంటూ గొడవ చేస్తున్నారు ఉద్యోగ సంఘాల నాయకులు. ఎలక్షన్ ఆఫీసర్ డౌన్ డౌన్ అంటూ బైఠాయించారు ఓ అరగంటసేపు. మొత్తంమీద ఓ అంగీకారానికి వచ్చారు. రెమ్యూనరేషన్ తీసుకొని బస్టాండుకు వచ్చింది జ్యోతిర్మయి. బస్సు నిండేదాకా బయలుదేరదు అన్నాడు కండక్టరు. కిటికీ పక్కన సీట్లో కూర్చొని కళ్లు మూసుకుంది జ్యోతిర్మయి.

మర్నాడు పేపర్లో మన ప్రజాస్వామ్యం ఇవిఎంలలో భద్రం అంటూ కొన్నింటిలో... ఇవిఎంలతో టాంపరింగ్ వంద పోలింగ్ స్టేషన్లలో రీ పోలింగ్ అంటూ మరో పేపర్లో తన స్టేషన్‌లో ఏపివో ఓట్లు బ్యాలెన్స్ చేయడం కోసం చేసిన వంద ఓట్లు గుర్తొచ్చి.. ఒక్కొక్క పిఎస్ వంద చొప్పున.. ప్రజాస్వామ్యమా వర్ధిల్లు అనుకుంది జ్యోతిర్మయి.

# నూరేళ్ళ తెలుగు కథ - స్త్రీ పురుష సంబంధాల చిత్రణ




- జయంతి పాపారావు

**స్త్రీ పురుష సంబంధాలు అంటే ఏంటి? విశాల ప్రాతిపదికన పరిశీలించాల్సిన విషయం ఇది. భార్యాభర్తల దాంపత్య సంబంధాలకే పరిమితమైంది కాదు. మన వ్యవస్థ, వ్యక్తి - కుటుంబం - సమాజంగా మూడు స్థాయిల్లో ప్రధానంగా ఉంది. ఈ మూడు స్థాయిల్లో స్త్రీ స్థానం ఏమిటి? స్త్రీ స్థానం తల్లిగా, చెల్లిగా, అక్కగా, భార్యగా కూతురిగా, కుటుంబేతర పరస్త్రీగా ఏమిటి? ఈ స్థాయిల్లో పురుషుని స్థానంతో స్త్రీ స్థానాన్ని వివిధ రంగాల్లో పోల్చి చూసినప్పుడు, స్త్రీ స్థానం ఏమిటి? ఎక్కడ ఏవిధంగా ఉంది? ఇటువంటి పలు విషయాలు ఈ సంబంధాల పరిధిలోకి వస్తాయి.**

మన భాషా సాహిత్యాల్లో 'ఆధునికత' 1900వ సంవత్సరానికి కొద్దిగా అటు ఇటూ ప్రారంభమైంది. ప్రజాస్వామ్య ఆలోచనా విధానం - స్వరాజ్య ఆకాంక్ష - బలపడ్డం వల్లే, స్వాతంత్ర్య ఉద్యమం వచ్చింది. ఆధునికత అంటే, విశాల దృష్టితో చూస్తే, ప్రజాస్వామ్య ఆలోచనా విధానం. అందువల్ల ఉద్యమంతోపాటే ఆధునికత వచ్చిందని చెప్పుకోగలం. గ్రాంథిక భాష పండిత వర్గానికే పరిమితమైపోయింది. ప్రజలు మాట్లాడుకునే భాషలో ప్రజలకోసం అన్న ప్రజాస్వామ్య ఆలోచనా విధానంతో గిడుగు వెంకటరామమూర్తి పంతులు వ్యవహారిక భాషా ఉద్యమం ప్రారంభించారు. దీని వెనుక మరో మహోన్నత లక్ష్యం కూడా ఉంది. వ్యవహారికభాష వల్ల ప్రజల్లో జాతీయోద్యమం పట్ల అవగాహన ఏర్పడి, ప్రజాఉద్యమంగా బలపడుతుందన్న లక్ష్యం కూడా ఉంది. గురజాడ వేంకట అప్పారావు ఈ ఉద్యమానికి దన్నుగా నిలిచారు. సాహిత్యంలో ప్రజాస్వామ్య ఆలోచనా విధానాన్ని ప్రవేశపెట్టారు. వ్యవహారిక భాషలో సాహిత్యరచన ప్రారంభించారు. సామాన్య ప్రజలను సాహిత్యంలో పాత్రలుగా ప్రవేశపెట్టారు. 'కన్యాశుల్కము' నాటకాన్ని వాడుకభాషలో రచించి, వాడుక భాషను కావ్యభాషగా చేశారు. ఆ నాటకం ఆగస్టు, 1892లో తొలిసారి ప్రదర్శింపబడింది. అదొక చారిత్రక సంఘటన. ఆ రోజున వాడుకభాష ఉత్తమ కావ్యభాష అయింది. వాస్తవ జీవితాన్ని చిత్రీకరించింది. ఆధునిక భాషా సాహిత్యాలకు యుగారంభమైంది. భాషా సాహిత్యాల్లోని ప్రాచీనతకు వీడ్కోలు పలికింది. వాడుక భాషా వ్యాప్తికి గురజాడ ఆ విధంగా సాహిత్య మార్గాన్ని నిర్దేశించారు. 'కన్యాశుల్కము' ఆధునిక భాషా సాహిత్య యుగానికి 'ఆదికావ్యము' అయ్యింది.

అటు గిడుగువారికి - ఇటు గురజాడ వారికి కూడా ఆధునిక ఆలోచనా విధానం వెనుక - వారి ఆధునిక ఉద్యమాల వెనుక - ప్రేరణగా పూర్వరంగం ఉంది. ఏఏ దేశాల్లో వాడుకభాషా ఉద్యమాలు వచ్చాయో, వాటి స్వరూప స్వభావాలు ప్రయోజనాలు, సంబంధిత గ్రంథాలు చదివి తెలుసుకున్నారు అదే ప్రధానంగా ప్రేరణ అయ్యింది. కందుకూరి వీరేశలింగం "రాజశేఖర చరిత్ర" నవల (1878)ని సులభ గ్రాంథిక శైలిలో రాశారు. ఆయన "బ్రాహ్మవివాహము" వంటి ప్రహసనాలు వాడుక భాషలో రాశారు. వేదం వేంకటరాయశాస్త్రి రచించిన "ప్రతాపరుద్రీయం" నాటకంలోని చిన్న పాత్రలు వాడుక భాషలో మాట్లాడతాయి. ఈ నాటకం కూడా ఇంచుమించుగ "కన్యాశుల్కము" కాలంలోనే వచ్చింది. ఇవన్నీ పూర్వరంగంలో ప్రేరణగా నిలిచాయి. ఆ విధంగా 'ఆధునికత' మన భాషా సాహిత్యాల్లో ప్రారంభమైంది. కందుకూరి వీరేశలింగం సంస్కరణోద్యమం ఆధునిక కావ్య వస్తువుకి ప్రేరణగా నిలిచింది. జాతీయోద్యమం కూడా కొంత వరకూ ప్రేరణ అయింది.

గురజాడ రచించిన 'దిద్దుబాటు' కథానిక (1910) తొలి తెలుగు ఆధునిక కథానిక నిర్ధారింపడింది. ఆ కథానికా విశ్లేషణతోనే ఈ అధ్యయనం ప్రారంభమైంది.

స్త్రీ పురుష సంబంధాలు అంటే ఏంటి? విశాల ప్రాతిపదికన పరిశీలించాల్సిన విషయం ఇది. భార్యాభర్తల దాంపత్య సంబంధాలకే పరిమితమైంది కాదు. మన వ్యవస్థ, వ్యక్తి - కుటుంబం - సమాజంగా మూడు స్థాయిల్లో ప్రధానంగా ఉంది. ఈ మూడు స్థాయిల్లో స్త్రీ స్థానం ఏమిటి? స్త్రీ స్థానం తల్లిగా, చెల్లిగా, అక్కగా, భార్యగా కూతురిగా, కుటుంబేతర పరస్త్రీగా ఏమిటి? ఈ స్థాయిల్లో పురుషుని స్థానంతో స్త్రీ స్థానాన్ని వివిధ రంగాల్లో పోల్చి చూసినప్పుడు, స్త్రీ స్థానం ఏమిటి? ఎక్కడ ఏవిధంగా ఉంది? ఇటువంటి పలు విషయాలు ఈ సంబంధాల పరిధిలోకి వస్తాయి. స్త్రీ పురుష సంబంధాల్లో ప్రేమానురాగాలు - వైరుధ్యాలు - ఏవిధంగా ఉన్నాయి? ఏస్థాయిలో ఉన్నాయి? స్త్రీ పురుషుల మధ్య నుండే ప్రకృతి సిద్ధమైన 'కామవాంఛ' అటు

ప్రేమానురాగాలకూ – ఇటు వైరుధ్యాలకు కూడా మూలకారణమన్న మూల తత్త్వాన్ని విస్మరించలేం.

అనాది నుంచి స్త్రీ మన సమాజంలో బలిపశువుగానే జీవిస్తోంది. స్త్రీ స్వేచ్ఛా రాహిత్యంలో, సంకెళ్ళ మధ్య, దోపిడీకి బలైపోతూ జీవిస్తోంది. శ్రమదోపిడీకి బలైపోతుంది. శరీర దోపిడీకి బలైపోతుంది. ఆస్తి దోపిడీకి బలైపోతుంది. హింసకు పలు మార్గాల్లో బలైపోతుంది! సతీ సహగమనమన్నారు. అంటే, సజీవ దహనం! పురుష ప్రపంచాన్ని ఉరితీయాల్సిన నేరం ఇది! బాల్య వివాహమన్నారు. ఎనిమిదేళ్ళకే పెళ్ళి, దానికి తోడు కన్యాశుల్కమన్నారు. అంటే ఏమిటి? పువ్వుగా వికసించకుండానే మొగ్గని నాశనం చెయ్యడమన్నమాట. కన్యాశుల్కం కోసం మొగ్గని వయసుతో సంబంధం లేకుండా వృద్ధులకు కట్టబెట్టడమన్న మాట. రజస్వల కాకముందే పెళ్లి అన్నారు. అలా కాకపోతే, ఆ కన్యలకు పెళ్ళిళ్ళు కాలేదు. జీవితాంతం మోడుగా జీవించాల్సిందే. బలిపశువులా చాకిరీ చేయాల్సిందే. వయసు మీరిన వారితో బాల్యవివాహాల వల్ల భర్తలు పోవడం, వితంతువులు కావడం, జీవితాంతం గొడ్డు చాకిరీ చేస్తూ, మోడుగా జీవించాల్సిందే. వితంతువులకు ఎన్నో ఆహార నియమాలు విధించి జీవితాన్ని దుర్భరం చేశారు. కన్యాశుల్కం దురాచారం పూర్తిగా పోకుండానే, వరకట్న దురాచారం వచ్చేసింది. వరకట్న దురాశలో వరహీన పెళ్ళిళ్ళు వచ్చేసాయి. దీనిక్కాడ స్త్రీ బలిపశువుగానే బలైపోయింది. ఇవేవీ చాలవన్నట్లు, పురుషుల బహుభార్యత్వం, వివాహేతర సంబంధాలు, మద్యపాన వ్యసనాలు, వరకట్న దాహాలు – వీటిల్లో స్త్రీ జీవితం అతలాకుతలమవుతూనే ఉంది. అత్యాచారాలు –మూకుమ్మడి అత్యాచారాలు – యువకుల ప్రేమోన్మాద దాడులు– ఆఫీసుల్లో, రోడ్ల మీద, వాహనాల్లో, లైంగిక వేధింపులు – ఆ విధంగా ఎన్నెన్నో మానసిక శారీరక హింసలు, గృహ హింసలు – ఆ విధంగా నేటి నాగరిక సమాజం – సభ్య సమాజం – ఆధునిక సమాజం – కూడ స్త్రీని హింసిస్తూనే వస్తోంది. ఆ విధంగా నాడు, నేడూ కూడా స్త్రీ హింసకు బలైపోతూనే ఉంది. హింస యొక్క రూపాల్లో తేడా ఉన్నా, హింస ఏదో రూపంలో ఏదో కొత్త రూపంలో కొనసాగుతూనే ఉంది. మన సమాజంలో స్త్రీ స్థానం నాడూ నేడూ కూడ 'బలిపశువు' స్థానమేనని మనం ఇక్కడ గుర్తు చేసుకున్న చరిత్ర నిరూపిస్తుంది. ఆ విధంగా ఎందుకు జరుగుతూ వస్తోంది?

ఆధునిక యుగారంభంలోనే వరకట్నం స్త్రీ జీవితంలో శత్రువుగా ప్రవేశించిందని 'అప్పుడు – ఇప్పుడు' (1914) వంటి కథానిక వల్ల స్పష్టమౌతుంది. మన వివాహ వ్యవస్థలో స్త్రీ ఎదుర్కొంటున్న కష్టాన్ని వాస్తవికంగా పలు కథానికలు చిత్రించాయి. బాల్య వివాహం – బాల్య వివాహం వల్ల వితంతు జీవితం – రజస్వల ముందే పెళ్లి కాక తప్పని నిర్బంధం – విద్యావంతులైతే భర్త ఆయుష్షు తగ్గిపోతుందన్న

**బాల్యవివాహాల వల్ల భర్తలు పోవడం, వితంతువులు కావడం, జీవితాంతం గొడ్డు చాకిరీ చేస్తూ, మోడుగా జీవించాల్సిందే. వితంతువులకు ఎన్నో ఆహార నియమాలు విధించి జీవితాన్ని దుర్భరం చేశారు. కన్యాశుల్కం దురాచారం పూర్తిగా పోకుండానే, వరకట్న దురాచారం వచ్చేసింది. వరకట్న దురాశలో వరహీన పెళ్ళిళ్ళు వచ్చేసాయి. దీనిక్కాడ స్త్రీ బలిపశువుగానే బలైపోయింది. ఇవేవీ చాలవన్నట్లు, పురుషుల బహుభార్యత్వం, వివాహేతర సంబంధాలు, మద్యపాన వ్యసనాలు, వరకట్న దాహాలు – వీటిల్లో స్త్రీ జీవితం అతలాకుతలమవుతూనే ఉంది.**

మూఢ విశ్వాసంలో స్త్రీని విద్యకు దూరం చేయబడ్డం – వరకట్న దురాశలో వరహీన పెళ్ళిళ్ళు – కన్యాశుల్క వివాహ విధానంలోని కష్టాలు – వరకట్న వివాహ విధానంలోని ఇబ్బందులు – మేనరిక పెళ్ళిళ్లలోని కష్టాలు, వివాహేతర సంబంధాలు – పురుషుల వంచనలు వంటి అంశాలు 'నాకు రుణం తీరింది' (1924), 'విద్యావతి' (1918), 'దిద్దుబాటు' (1918), 'నేనే' (1914), చంపకసందేహ నివృత్తి' (1914), నిశీధినీ శంఖారావం (1959) వంటి కథానికలు వాస్తవ జీవితంలోంచి వాస్తవికంగా ఆవిష్కరించాయి. జీవితాన్ని లోతుగా అధ్యయనం చేసి నిజాయితీతో వాస్తవాలను ఆవిష్కరించారు. 1914లోనే – 'అప్పుడు, ఇప్పుడు' అన్న కథానిక వరకట్న దురాచారం గురించి విశ్లేషించింది. వరకట్నం వల్ల స్త్రీ జీవితం అధోగతికి వచ్చేసింది. ఆడపిల్ల అభివృద్ధి ఆగిపోయింది. అటు తల్లితండ్రులు – ఇటు ఆడపిల్లలు కన్నీళ్లు పెడుతున్నారు. వరకట్నంతో పెళ్ళయిన తరువాత కూడా కట్నాలు లాంఛనాలు చాలలేదని వేధింపులు ప్రారంభమౌతాయి. తగువులూ, విరోధాలు వచ్చి కుటుంబ సంబంధాలు చెడిపోతున్నాయి. బజారులో బేరం పెట్టి మగపిల్లలను అమ్ముకుంటున్నారు. చదువుకున్నవాళ్ళు ఆ విధంగా అమ్ముడుపోవడాన్ని ఎలా హర్షిస్తున్నారు? ఆడపిల్లకి ఇంతకంటే అవమానం ఏమి కావాలి? ఇంతకంటే అపకారం ఏమి కావాలి? ఆ విధంగా ఈ కథానిక పురుష ప్రపంచాన్ని నిలదీస్తుంది. రైలుబండిలో (1920), 'ఈ రాధేనా' (1938), తనూ – నీరజ (1952) వంటి కథానికల్లో వితంతు వివాహాలను – ప్రేమ పెళ్ళిళ్ళను – ప్రోత్సహించే చైతన్యం ఆవిష్కరింప బడింది. స్త్రీ సమస్యలను పురుషుడే సృష్టిస్తున్నాడు. కాబట్టి పురుషుడే వివేచనతో చైతన్యవంతుడై సమస్య లను నిర్మూలించాలని, అది పురుషుని బాధ్యతేనని 'చంపక సందేహ నివృత్తి' (1914)లో సందేశం ఉంది. స్త్రీ విద్యవల్లే చాలా వరకు సమస్యల నుంచి బయటపడగలదని చాలా కథానికలు పరిష్కారాన్ని చూపించాయి. వివాహం పేరుతో పురుషుడు చేస్తున్న వంచనలు 'లోకం నవ్వింది' (1963), 'వంతెన' (1973), వంటి కొన్ని కథానికలు చిత్రీకరించాయి. పురుషుడికి ఓ న్యాయమా? స్త్రీకి ఓ న్యాయమా? అని కొన్ని కథానికలు ప్రశ్నిస్తాయి.

స్త్రీ స్వేచ్ఛ విషయానికొస్తే, వివాహ వ్యవస్థలో స్త్రీకి ఏమాత్రం స్వేచ్ఛలేదని స్పష్టమౌతుంది. వివాహం స్త్రీ జీవితంలో ఓ గొప్ప మలుపు. ఓ గొప్ప పరిణామం. కన్నవారికి దూరమై పర పురుషుణ్ని భర్తగా స్వీకరించి, జీవితాన్నంతా ఆభర్తతో మరో ఇంట్లో గడపమన్నమాట. భర్త ప్రేమానురాగాలే కాకుండా, ఆ కుటుంబంలోని అందరి ప్రేమానురాగాలు సంపాదించుకోవడానికి, ఆమె తన జీవితాన్నంతా వాళ్ళకి అంకితం చేసి అర్పించడమన్న మాట. శరీరాన్ని, మనసుని,

శరీర శ్రమను భర్తకు అర్పిస్తే, శరీర శ్రమను మనసుని ఇతర సభ్యులకు అర్పించడమన్న మాట. స్త్రీ వివాహంతో 'వలస' జీవిగా మారిపోతుందన్న మాట! వలస జీవుల కష్టాలు అందరికీ తెలుసు. అంత గొప్ప మలుపులోనే స్త్రీకి స్వేచ్ఛలేనప్పుడు, ఆ తదుపరి వలస జీవితంలో స్వేచ్ఛ దొరుకు తుందను కుంటే అది అత్యాశే అవుతుంది. భార్యాభర్తల సంబంధాల్లో స్వేచ్ఛ ఉందనీ, ఉంటుందని భ్రమిస్తే, అది చారిత్రక తప్పిదమే ఔతుంది. మనవ్యవస్థలో పెట్టుబడిదారుడు – శ్రామికుడు – మధ్య సంబంధమే భార్యభర్తల మధ్య ఉంది. భర్త యజమాని, భార్య శ్రామికురాలు. మరి స్వేచ్ఛ ఎలా, ఏ విధంగా ఎక్కణ్నుంచి వస్తుంది? దానికి తోడు, భార్య వలస జీవి! రాజీపడి జీవిస్తూ, స్త్రీ అదే స్వేచ్ఛన్న భ్రమలో జీవిస్తుంది. పలు కథానికలు స్వేచ్ఛారాహిత్యాన్ని పలు పార్శ్వాల నుంచి విశ్లేషించాయి. భర్త నుంచి, కొడుకు నుంచి, మనవడు నుంచి ఎవరి దగ్గర్నుంచి చిన్న చిన్న విషయాలలో కూడా స్వేచ్ఛ దొరకని ఆశాజీవుల విషాద జీవనచిత్రణ 'ఆశాజీవి' (1960)లో ఉంది. స్వార్థ ప్రయోజనాలకోసం భార్యను పరపురుషుల దగ్గరకు పంపించే విషాదచరిత్ర 'మయూరాక్షి' (1987)లో కనబడు తుంది. వివాహేతర సంబంధం ఉన్న భర్త మీద పగతీర్చుకోవడానికి తానూ వివాహేతర సంబంధం కుదుర్చుకున్న ధిక్కారం 'ఒంటరితనం' (1927) 'సంస్కారహీనుడు' (1950) 'కసి' (1974), వంటి కథానికల్లో ఉంది. పురుషుడి కొక న్యాయం, స్త్రీకి ఒక న్యాయం ఉన్న వ్యవస్థ మీద తిరుగుబాటు చైతన్యం వాటిల్లో ఉంది. "వంటమనిషి కావాలని పెళ్లి చేసుకుంటారన్నమాట! ఇల్లు చూసుకునే మనిషి కావాలని వీళ్ళంతా పెళ్ళిళ్ళు చేసుకుంటారన్నమాట! ప్రేమలు, మురిపాలు అంతా కల్లబొల్లి మాటలే!" అని భ్రమలోంచి బయటపడిన చైతన్యాన్ని చిత్రీకరించిన 'ది లాంగెస్టు డే' (1967) వంటి పలు కథానికలూ ఉన్నాయి. స్వేచ్ఛా రాహిత్యంలో స్త్రీ బలిపశువు గానే, జీవిస్తోందన్న సత్యాన్ని కొన్ని కథానికలు ఆవిష్కరించాయి.

> **సాహిత్యం నిర్మాణశీల మార్గంలో ప్రజలను చైతన్యపరచే దిశలో ఉద్యమించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ప్రజా ఉద్యమాలూ ఎప్పుడూ ఓడిపోవు. సంస్కరణోద్యమ ప్రభావంలో సతీసహగమనం – బాల్యవివాహాలు – కన్యాశుల్కం – వంటి దురాచారాలెన్నో పోయి వితంతు వివాహాలు వంటి మంచి మార్పులెన్నో వచ్చాయి. నిర్మాణశీల తిరుగుబాటు ప్రజాఉద్యమాల వల్ల క్రూరమైన విధానాలు నిర్మూలించబడతాయి. ప్రజలు ఎప్పుడూ గెలుస్తారు. నిజమైన 'స్వేచ్ఛ' లభిస్తుంది.**

పురుషాధిపత్యం విషయానికొస్తే, అదెక్కడ లేదు? చీకటిలా, కనిపించని శత్రువులా అంతటా కమ్ముకునే ఉంది. పెట్టుబడి ఆధిపత్యాన్ని కలిగి ఉంటుంది. స్త్రీ పురుష సంబంధాల్లో పురుషుడు యజమాని కాబట్టి 'ఆధిపత్యం' కలిగి వుంటాడు. పెట్టుబడిదారీ వ్యవస్థ స్వభావం అది. స్త్రీకి, ఏం కావాలో పురుషుడే నిర్ధారించి, స్త్రీ జీవితాన్ని తనకు అనుకూలంగా నిర్దేశించి నడుపుతాడు. స్త్రీకి ఏం కావాలో స్త్రీయే నిర్ణయించుకునే, స్త్రీ తన జీవితాన్ని తానే నిర్దేశించి నడుపుకునే స్వేచ్ఛ స్త్రీకి ఏనాడూ లేదు. పురుషాధిపత్యానికి కొండగుర్తు వరకట్న వివాహవ్యవస్థ పలు కథానికలు పురుషాధిపత్యాన్ని పలు కోణాలనుంచి విశ్లేషించాయి.

తన ప్రాణాలు కాపాడిన తరుణంలో ఆవేశంలో పరపురుషుడు దగ్గరగా తీసుకోగా, ఆమెను భర్త శంకిస్తాడు. మానసికంగా వేధిస్తాడు. 750 సంవత్సరాల కిందటి చారిత్రక సంఘటన ఇది. ఆ పురుషుడు ఎవరో కాదు, పురుష వేషంలో రుద్రమదేవి! అది నుంచీ, తరతరాల నుంచి పురుషాధిపత్య స్వభావం ఏవిధంగా కొనసాగుతోందో 'హృదయశల్యము' (1912) కథానిక ఆవిష్కరించింది. శృంగారతత్త్వం పురుషాధిపత్యాన్ని తన పాదాల మీద పడేటట్లు ఏవిధంగా చేయగలదో కొన్ని కథానికలు ఆవిష్కరించాయి. పురుషాధిపత్య పీచమణచి, భర్త పిల్లలూ ఉండగా, తనకు నచ్చిన పరపురుషునితో సంసార జీవితం గడిపిన "లైంగిక స్వేచ్ఛ" చైతన్యాన్ని ఆవిష్కరించిన 'ఒంటరితనం' (1927), 'కసి' (1974) వంటి కథానికలూ వున్నాయి. పురుషాధిపత్యాన్నిధిక్కరించి చైతన్యమూ కొన్ని కథానికల్లో ప్రవహించింది. స్త్రీ, పురుషులు స్నేహంగా ఉంటే, దాన్ని వివాహేతర సంబంధంగా వక్రీకరించిన మన వ్యవస్థ స్వభావాన్ని కొన్ని కథానికలు చిత్రీకరించాయి. లైంగిక స్వేచ్ఛ' అంటే ఏమిటో 'ఒంటరి తనం' 'నటుడు', 'కసి' వంటి కథానికల్లో కాస్త అవగాహన కలుగుతుంది. ప్రియురాలి దగ్గరకు ప్రేమికుడు – దేవుని దగ్గరకు భక్తుడూ అహంకార రహితమైన హృదయంతో వెళ్ళాలి. అప్పుడే వారి వాంఛలు ఫలిస్తాయి. – అన్న సందేశాన్నిచ్చిన 'తనూ – నీరజ' (1952) వంటి కథానికలు ఉన్నాయి. ఆధిపత్యం – స్వేచ్ఛ – రెండు వైరుధ్య భావజాలాలు. స్త్రీ, పురుషాధిపత్యం నుంచి విముక్తి కావాలని, పురుషునితో సమానంగా స్వేచ్ఛ కావాలని ఆకాంక్షిస్తుంది. స్త్రీకి పురుషునితో సమానంగా ప్రజాస్వామ్య స్వేచ్ఛ కావాలి. ఈ వ్యవస్థలో పురుషునికి మాత్రం ఏ మాత్రం స్వేచ్ఛ ఉందనే ప్రశ్న కూడా వస్తుంది.

పురుషుల వ్యసనాల వల్ల స్త్రీ పురుష సంబంధాల్లో విషాదం సృష్టించబడుతుంది. స్త్రీ జీవితం దుర్భరమౌతుంది. పిల్లల జీవితం నిర్లక్ష్యానికి బలైపోతుంది. మద్యపానం – వివాహేతర సంబంధాలు – లంచగొండితనం వంటి పలు వ్యసనాలకు పురుషులు బానిసలై పోయారు. పట్టణ నగర స్త్రీ కంటే, గ్రామీణ స్త్రీ బతుకు పురుషుల వ్యసనాల వల్ల మరీ దుర్భరంగా విషాదంగా ఉంది. ఇదంతా 'ఆనంద మందిరం' (1926), 'దిద్దుబాటు' (1910) వంటి కథానికల్లో చిత్రీకరించబడింది.

స్త్రీ శరీరం వివిధ స్థాయిల్లో వ్యాపార పదార్థంగా పెట్టుబడిదారీ వ్యాపారవర్గం తయారుచేసింది. ఈ విషయం పైన, 'నీలిదువ్వెన' (1915), సౌఖ్య రాసి (1941), తప్పు కాదు? (1984) వాల్‌పోస్టర్ (1991) వంటి ఎన్నో కథలు వచ్చాయి. స్త్రీ నగ్నత్వ ప్రదర్శన వ్యాపారభివృద్ధి ప్రకటనల్లో, ప్రదర్శనల్లో ప్రధానపదార్థం గా తయారు చేశారు. వెండి తెరలో, బుల్లి తెరలో స్త్రీ నగ్నత్వ ప్రదర్శన వ్యాపారం లక్షలకోట్లలో ఉంది. స్త్రీ శరీర నగ్నత్వం ఆధారంగా సాగుతున్న వ్యాపారం – సమాజానికి తీరని హాని, ద్రోహం చేస్తుంది. అయినప్పటికీ, అది స్త్రీ ఇష్టంతో జరుగుతున్న వ్యాపారం కావడంవల్ల, పెట్టుబడిదారీ వ్యాపార వ్యవస్థలో వీటి నిర్మూలనం అంతతేలికైన పనికాదు.

పురుషుల అక్రమార్జన వ్యసనాల్లో ప్రవహిస్తుంది. అక్రమార్జన, వివిధ స్థాయిల్లో వ్యవస్థలో ప్రవహిస్తుంది. దీన్ని నిర్మూలించటం, కూడ మన వ్యవస్థలో అంతతేలికకాదు. మరి వ్యసనాలు ఒద్దంటే పోతాయా?! పెట్టుబడిదారీ వ్యాపార వ్యవస్థలో వ్యసనాలు పోవు: పోనివ్వరు: ఎందుకంటే అవి అత్యధికలాభాలు కొల్లగొడతాయి: ప్రజల కష్టార్జితం కూడ వ్యసనాల్లో ప్రవహిస్తోంది: నల్లధనాన్ని సృష్టిస్తాయి. నల్ల ధనాన్ని తెల్లధనంగా మార్చుకోగలిగే ఎన్నో అవకాశాలు మన దోపిడీ వ్యవస్థలో ఉన్నాయి: ప్రజల బలహీనతలే ఆధారంగా సాగే వ్యసన వ్యాపారాలవి: మన ఆర్థిక వ్యవస్థలో తెల్లధన ఆర్థిక వ్యవస్థలో, బలమైన శక్తిగా ప్రవహిస్తున్న సమాంతర నల్లధన ఆర్థిక వ్యవస్థ ఉంది. అందులో వ్యసన వ్యాపారాల ఆర్థికశక్తి చిన్నదేమికాదు! వ్యవస్థలో, వ్యవస్థ ఆర్థికశక్తిలో, వ్యవస్థీకృతమైపోయిన వ్యసనవ్యాపారాలు 'పో' అంటే పోతాయా? పోనిస్తారా? వ్యవస్థలో సమూలమైన మార్పు వచ్చినప్పుడే, వీటికి పరిష్కారాలు దొరకవచ్చు. అంతవరకూ, చిమ్మచీకట్లో చిరు నక్షత్రాలు చూస్తూ భ్రమలో జీవించాల్సిందే!

ఆహారం - మంచినీరు - వాయువు శరీరానికి ఎంత అవసరమో, మద్యపాన సుఖం - అక్రమార్జన సుఖం - అంతే అవసరమన్న విధంగా వ్యవస్థ నడుస్తున్నదన్న వాస్తవాన్ని విస్మరించలేం. ఈ వ్యవస్థను చూసి మేధావులు ఆందోళన పడతారు. ఆవేదన పడతారు. అక్షరరూపంలో ఆవిష్కరిస్తారు. వారి పనివారు చేస్తారు. పురుషుల వ్యసనాల నుంచి విముక్తి చేయడంలో స్త్రీ చూపించిన చైతన్యాన్ని కొన్ని కథానికలు ఆవిష్కరించాయి. అవకాశం దొరికినప్పుడు, ఎన్ని నీతులు చెబుతున్నా, పరస్త్రీ సుఖాలను పురుషులు వదులుకోరన్న వాస్తవాన్ని 'నేనే' (1914), 'పులిబోను' (1964), వంటి కొన్ని కథానికలు ఆవిష్కరించాయి. కులం - మతం - విషాద పరిణామాలచే సృష్టిస్తుంది. ఈ వాస్తవం 'అమ్మీజాన్' (1999), 'అగ్రహారం' (2008), 'కసి' (1974) కథానికల్లో చిత్రించబడింది. ఇంక ఇతర సమస్యల విషయానికొస్తే, స్త్రీ పురుష సంబంధాల్లో అవగాహనా రాహిత్యం ప్రధాన వైరుధ్యంగా కనిపిస్తుంది. మనసు విప్పి మాట్లాడుకోకపోవడం మరో వైరుధ్యంగా దర్శనమిస్తుంది. "శరీరం అమ్ముకొనని మానవుడెవడైనా ఉన్నాడా? నువ్వు జీతానికి పని చెయ్యటం లేదా?" అని ఓ పతిత 'సౌఖ్యరాశి' (1941)లో ప్రశ్నించి అందర్నీ ఆశ్చర్యపరుస్తుంది.

స్త్రీ పురుష సంబంధాల్లో సామరస్య సహజీవన సంస్కృతిని పెంపొందించడానికి కథానికా సాహిత్యం తనదైన కృషి నిరంతరం కొనసాగిస్తూనే ఉంది. వైరుధ్యాలను విశ్లేషించి చూపిస్తుంది. వైరుధ్యాలు నిర్మూలించబడినప్పుడే, ప్రేమానురాగబంధాలు వికసిస్తాయి. వరకట్నం - మద్యపానం - స్త్రీ శరీరంతో అంతే కాకుండ స్త్రీ నగ్నత్వంతో వ్యాపారం - అక్రమార్జన జీవన విధానం - అత్యాచారాలు - ప్రేమోన్మాదదాడులు - గృహహింస వంటి పలుక్రూరమైన విధానాలు మన దోపిడీ వ్యవస్థలో వ్యవస్థీకృతమైపోయాయి. అయితే, ప్రజలకూ, ప్రజాఉద్యమాలకూ సాధ్యం కానిదేదీ ఉండదు. నిర్మాణశీల ప్రజా ఉద్యమాలు వస్తే, అవన్నీ నిర్మూలించబడతాయి. ఆ దిశలో సాహిత్యం నిర్మాణశీల మార్గంలో ప్రజలను చైతన్యపరచే దిశలో ఉద్యమించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ప్రజా ఉద్యమాలూ ఎప్పుడూ ఓడిపోవు. సంస్కరణోద్యమ ప్రభావంలో సతీసహగమనం - బాల్యవివాహాలు - కన్యాశుల్కం - వంటి దురాచారాలెన్నో పోయి వితంతు వివాహాలు వంటి మంచి మార్పులెన్నో వచ్చాయి. నిర్మాణశీల తిరుగుబాటు ప్రజాఉద్యమాల వల్ల క్రూరమైన విధానాలు నిర్మూలించబడతాయి. ప్రజలు ఎప్పుడూ గెలుస్తారు. నిజమైన 'స్వేచ్ఛ' లభిస్తుంది.

- సౌభాగ్య

# లూసియో పిక్‌లో




**లూ**సియో పిక్‌లో 1901లో ఒక ప్రాచీన ఉన్నత వంశంలో సిసిలీ ద్వీపంలో జన్మించాడు. లాటిన్, గ్రీకు భాషలు, మధ్యయుగాల సాహిత్యం, ఆల్జీబ్రా, తత్వశాస్త్రం, రహస్యవాదం అభ్యసించాడు. వాగ్నర్ సంగీతంతో తీవ్రంగా ప్రభావితుడయ్యాడు ఔత్సాహిక వయోలిన్ వాద్య నిపుణుడిగా పేరు పొందాడు. యవ్వనంలో విస్తృతంగా ఆంగ్లసాహిత్యాన్ని అధ్యయనం చేశాడు. పన్నెండేళ్ళ వయసులో W.B. ఈట్స్ కవితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు.

'ద లియొసార్ట్' అన్న సుప్రసిద్ధ నవల రాసిన 'లాంపి దూసాకు' పికోలో దగ్గర బంధువు. లాంపి దూసా ఆ నవల రాయడానికి ప్రేరణ లూసియో పికోలోనే ఎలాగంటే లూసియో పిక్‌లో 1954లో ఒక సాహిత్య సమావేశంలో పాల్గొన్నాడు. అది రోం నగరంలో జరిగింది. ఆ సాహిత్య సమావేశానికి లూసియోని ఆహ్వానించినవాడు. సుప్రసిద్ధ ఇటాలియన్ కవి మోంటేల్. ఆ సమావేశంలో లూసియో పిక్‌లో విజయాన్ని చూసి ఆ ప్రేరణతో లాంపిడూసా ఆ ప్రసిద్ధ నవల రాశాడు.

తను సాధించిన సాహిత్య విజయాలకు ముందు, వాటి తరువాత కూడా వాటితో నిమిత్తం లేని నిజమైన, వాస్తవమైన ప్రశాంత ఆనంద జీవితాన్ని గడిపిన ఉత్తమ మానవుడు లూసియో పిక్‌లో సిసిలీ ద్వీపంలోని కేపోడీ ఆర్లాండో అన్న చోట తన తోబుట్టువుల్తో ప్రశాంత, ఉల్లాస జీవితం గడిపి అక్కడే తనువు చాలించాడు.

ఆధునిక ప్రపంచకవుల్లో లూసియో పిక్‌లోది అసాధారణ స్థానం. ఆయన కేవలం మూడు కవితా సంపుటాలు మాత్రమే ప్రచురించాడు. ఆయన జీవిత కాలంలో వచ్చిన ఆ సంపుటాలన్నిటితో కలిపి అచ్చయిన ఆయన కవితలు 37 మాత్రమే మొదటి సంపుటి ఆయన 37వ ఏట వచ్చింది.

రోమ్‌లో జరిగిన సాహిత్య సమావేశానికి ఆయన్ని ఆహ్వానించినపుడు ఆయన కవితల్ని పుస్తకంగా వేయమని మోంటేల్ ఒక ప్రచురణకర్తతో చెప్పాడు. అంతమంది జనంలో అంత సుప్రసిద్ధుడయిన కవి ప్రత్యేకించి లూసియోపిక్‌లో గురించి చెప్పడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఆ సందర్భంలో పికోలో ప్రశాంతంగా నెమ్మదిగా, నిగర్వంగా వున్నాడు.

ఎప్పుడో అరుదయిన సందర్భంలో జరిగిన ఒక ఇంటర్వ్యూలో 'తనది ఆటవిక చైతన్యం' అని చెప్పుకున్నాడు. రవీంద్రనాథ్ టాగూర్ చెప్పుకున్న మాటల్ని అవి గుర్తుతెస్తాయి. 'నేను స్వభావరీత్యా ఆరణ్యకుణ్ణి' అన్నాడు రవీంద్రుడు.

ఆ సాహిత్య సమావేశం తరువాత ఆయన మళ్ళీ సిసిలీ ద్వీపం చేరి తన ఏకాంత ప్రశాంత ప్రపంచంలో మునిగిపోయాడు. ఆయన వ్యక్తిగత, సాహిత్య జీవితాలు రెండిట్లో ఆయన 'చరిత్ర పూర్వ జీవన స్పృహ' తో జీవించినట్లు విమర్శకులంటారు కానీ మోంటేల్' మన కాలంలో వున్న నిజమైన కవి పికోలో' అన్నాడు. పిక్‌లో తన కవిత గురించి చెబుతూ" నా కవితలు అవసరం నించీ ఆవిర్భవించాలని కోరుకుంటాను' అన్నాడు. తన కవితకు వూహల్లో కాక దాని వేర్లు భూమిలో వున్నాయన్నాడు. ఆయన అధ్యయనం ఆయన దృఢమయిన నమ్మకాలకు మరింత బలాన్నిచ్చింది. తను స్పానిష్ మార్మిక రచనల్ని, హస్సెర్ల తత్వశాస్త్రరచనల్ని చదువుకున్నట్లు చెప్పుకున్నాడు.

1967లో వచ్చిన 'ఫ్లుమేలియా' అన్న ఆయన చివరి కవితా సంపుటిలో తొమ్మిది కవితలున్నాయి. అందులో ఒక కవితలో ఈ ప్రపంచం నించీ వుపసంహరించుకుని 'స్వచ్ఛ'మయిన కవిత్వం కోసం ప్రయత్నిస్తున్నట్లు చెబుతాడు. ఆ కవితపై వచ్చిన ప్రశ్నలకు సమాధానం చెబుతూ 'ఈ కవితలోని కల్పిత గాథ కవి స్థితిని సంకేతాత్మకంగా వివరిస్తుంది. అందులోని కవి తన సమస్తాన్ని కవిత కోసం స్వచ్ఛమయిన కవిత కోసం త్యజిస్తాడు. ఇతర మనుషుల నుండీ దూరంగా వుంటూ, ప్రపంచంనించో ఉపసంహరించుకుని వుంటాడు. తన ఏకాంత ప్రపంచాన్ని నిర్మించు కుంటాడు. అతీత శక్తితో అతనికి ఆత్మీయ సంబంధముంటుంది. అతని ఆంతర్యంలో మొదలయిన కాంతివంతమయిన కాంక్ష, స్వచ్ఛమయిన కవిత కోసం రగిలే ఆకాంక్ష అతనికి జవాన్ని జీవాన్ని యిచ్చి అతన్ని స్వతంత్రుణ్ణి చేస్తుంది.' అంటాడు.

# జనమే కదా ఘనం

- చిన్ని నారాయణరావు

జనం...జనం... జనం
జనం ఎక్కుపెట్టిన శరాలైతే
నిత్యం చైతన్యం
జనం ఎగిసిపడే కెరటాలైతే
ఎటుచూసినా ప్రభంజనం
జనం కుంభవృష్టి అయితే
విజయాల వెల్లువకు శ్రీకారం
కార్యశీలన ఏదైనా... వ్యవహారం
ఎప్పుడైనా - ఎక్కడైనా
జనంతోనే అను నిత్యం పని
జనం కోసం మనిషి చూపులగని
మీటింగైనా... షూటింగైనా
ప్రదేశం ఏదైనా.. విన్యాసం ఎక్కడైనా
జన సాంద్రత విరిసిన పూదోట
అయితేనే సతత హరితం
కోటబురుజుపై జెండాలా ఎగిసిపడేది.
జనార్ణవమైతేనే భువిపందు వెన్నెలను తలపించేది
సభా స్థలికి వన్నె చిన్నెలు తీర్చిదిద్దేది
తోరణాలై పచ్చదనం పరవశమై చిగుళ్ల తొడిగేది



కాలం యవనికపై....
వెలుగు దివిటీలు పట్టేది జనమే కదా
జనంతోనే నగరం సరికొత్త కళ సంతరించుకొనేది
జనంతోనే నగరం హిమవన్నగ కాంతులీనేది
ప్రతి పొలిటికల్ పార్టీకి
క్యాడర్ విస్తృతిపైనే కదా కన్ను
జనం గుండెల్లో జాగృతమై ప్రవహించడమే
పార్టీలకు వెన్నుదన్ను
ప్రతి వైప్లవ్య గీతానికి జనమే కదా
పల్లవి పాడేది
ప్రతి ఉద్యమం వెనుకా జనం హోరుదే
కదా ప్రధాన భూమిక.
అందుకే జననాశ్వానికి
ఎదురేగి రెడ్ కార్పెట్ పరుస్తాను
జనం నా గుండె చప్పుడు
జనచేతనం నాకేతనం
జనంతోనే నా ప్రస్థానం
జనం ఉదయించని సమయం
మసకబారిన ఉషోదయం
కాలం కత్తుల వంతెనపై
వ్యక్తుల అడుగు జాడలే
చెరిగిపోని చేవ్రాలు
మహనీయుల పాదముద్రలే
భావితరాలకు స్ఫూర్తినిచ్చే తరగని సంపదలు!

---

ఈ కవితకు పూర్ణ రంగాన్నీ, కవిత్వ సారాంశాన్నీ వివరించిన పిక్‌లో ఈ కవితలో నిండి వున్నాడన్న సత్యం మనకు తెలుస్తూనే వుంది.

**చివరి సందేశం' అన్న కవితలో**

'ఉదయ కాంతిలో ఉద్యానవనం నుండీ
దట్టమైన పచ్చదనం నుండీ ఒక్క అణువు కూడా మాయం కాలేదు.
పచ్చదనం నిష్క్రమించినపాదఛాయ లేవీ లేవు.
నిద్రపోతున్నప్పుడు ఎవరయినా వెళ్ళిపోయిన విషయమూ
ఎవరూ చెప్పలేరు.
నిర్లక్ష్యంగా సాగిపోయిన సందేశం
అజ్ఞాతంగానే మాయమైంది' అంటాడు.

ఆయన చెప్పిన సందేశం లాగే ఆయన అభిప్రాయం కూడా పారదర్శకంగా వుంటుంది. ఆధునిక కవిత్వ చరిత్రనించీ ఆయన సందేశం లాగే మౌనంగా నిష్క్రమిద్దామన్న ప్రయత్నం ఆయన్లో కనిపిస్తుంది. దాన్ని ప్రయత్నమని మనం 'అనడం' కూడా సాహసమే!

ఆయన సృష్టి అంతా అభౌతిక స్పర్శతో ఆకర్షణల్ని దూరంగా వుంచుతుంది. ఐనా ఆయన సంపూర్ణరచనలు ఆంగ్లంలోకి అనువదింపబడి ప్రపంచకవుల ప్రశంసలందుకున్నాయి.

## మారే ప్రపంచం

ఇది మారే ప్రపంచం
మారిన ప్రపంచం, మారుతున్న ప్రపంచం
తుఫాను వేగంతో దూసుకొస్తున్న కాంతితో
వర్ణరహిత కాలంతో శాశ్వత ప్రవాహంతో
ఆడంబరంగా సాగే మేఘాలతో
ఇది మారే ప్రపంచం
ఒక తక్షణ స్పందన, ఒక క్షణిక దర్శన
మెరుపుల్లా అన్నీ వస్తుంటాయి, వెళుతుంటాయి
వేల సంవత్సరాలు అధికారం
అజ్ఞాతంగా సాగుతూ వుంటుంది
ప్రతిరోజూ వుదయం
అరుణారుణ కాంతి తోరణంలో
ఉదయించే సూర్యుడు ఉత్సాహంగా
నవ్వుతూ వుంటాడు.



# కొన్ని యుగాలు - తేల్చని సగాలు

**- పోతగాని సత్యనారాయణ**



కాళ్ళు తెగిన నాగరికత
ఒక రక్తసిక్త స్వప్నమై కలవరపెడుతుంది
సమతావాదిగా నటించే
'వాడి' అహంకృత హింసావనిలో
"ఆమె" నిరంతర జీవన్మరణ
స్వేచ్ఛా మంత్రమై ఆక్రోశిస్తుంది
అకృత్యాలు, అధికృతలు కవలలై నర్తిస్తుంటే
ముగింపులేని మౌన హింసలు నిర్బంధాలై శాసిస్తుంటే
అనాదిగా అణకువతో ఆవహించిన పరాధీనత
మార్పుకు తప్ప "ఏ మార్పుకు" తావులేని -
కాలాన్ని కలగంటోంది
అసమానత హద్దులు దాటి, అజమాయిషీ గద్దెనెక్కాక,
తీరు మారని వారసత్వం,-
మాటల వసంతాలను గుప్పిస్తూనే వుంది!
జోకొట్టే ఉదార వాదాలను
వరదలుగా పారిస్తూనే వుంది!!
ఆర్థిక స్వేచ్ఛకు రెక్కలు మొలవనిదే
అర్ధనారీశ్వర సూత్రాలకు అర్థముండదు!
వాడికి వాడేమిటో తెలియనిదే
పీడించే వివక్షతల తీరుమారదు!
బతుకు పొడవునా పరుచుకున్న
పరమ పద సోపానంలో
ఆమె ఇప్పటికీ -
విష నాగుల కాటుకు సిద్ధం చేయబడుతున్న బలిపశువే!
నడి రోడ్డుపై చురకత్తులతో
పీకలు కోసే అమానుషం పేట్రేగి పోతున్నా
వాడి వంచనకు తలవాల్చి
అద్దాలలో బిడ్డనెత్తుకొని
అనుక్షణం మౌన పోరాటాలౌతున్నా -
గుణపాఠాలను నేర్వక
ఏడ్చే సముద్రాన్ని ఎవరు ఊరడిస్తారు
బ్రద్దలయ్యే అగ్ని పర్వతానికి
చైతన్యాన్ని ఎవరు రగిలిస్తారు
ఇక ఆమెలందరూ...
దేకుతున్న నాగరికతకు కాళ్ళను మొలిపించాలి!
విశ్వంలో సగమై వెలిగి జయకేతనమెగరెయ్యాలి

---

# వెన్నెల రేయి

**- డా॥ చల్లా రవికుమార్**



ఏ పూవ్వు పూయని
పరిమళం ఒకటి కమ్ముకుంది
అది చల్లగా
మత్తుగా ఉంది.
ఏ వాయిద్యమో మోగని
సంగీతమొకటి వినపడుతుంది
అది నిశ్శబ్దానికి కూడా
రాగాల సోయగాన్ని అద్దుతుంది ఈ చిన్ని
పూలరెమ్మ కూడా
నిశ్శబ్ద గీతానికి ఊయల లూగుతోంది
ఉప్పొంగిన హృదయంతో
నిద్రమానుకున్న పిట్టలు
పాటలు మొదలెట్టాయి
బద్ధకంతో బరువెక్కిన
వెదురు పొద కూడా
ఒళ్ళు విరుచుకు కూర్చుంది విలాసంగా
ఆగనా సాగనా అంటూ నడుస్తోంది
జోరు తగ్గిన సెలయేరు.

ఈ రాత్రి
కదలకుండా ఉండిపోవాలని
పుష్పించిన హృదయంతో
ప్రార్థిస్తుంది ప్రతి ప్రాణీ
నడవక తప్పుతుందేమోనని
అడగరాదూ కాలాన్ని!

---

# సునామీ

**- పి. శ్రీనివాస్ గౌడ్**



పొరల పొరల నీలం చీర
ఎర్రటి సింధూరం ధరించి
నక్షత్రాల్లాంటి నయనాలతో
మేఘాల చేతులతో
వీడ్కోలు పలుకుతూ
చూడవచ్చిన సందర్శకులకు
గాలిలో ముద్దులిస్తూ
ఆ రాత్రి నిశీధిలోకి
ఆమె నిష్క్రమిస్తుంది
అటుపై
కోరికల్ని అణిచిపెట్టిన
పవిత్ర పవనంలా
ఆమె వస్తుంది
దూకి వచ్చే అలలా ప్రకాశిస్తూ
ఆ సముద్ర తీరాన్ని
జ్ఞాపకాల్లో ఊరబెడుతుంది

మలయాళం : పి. అజిత్‌కుమార్
ఇంగ్లీషు : సి.ఎస్. వెంకటేశ్వరన్
తెలుగు : పి. శ్రీనివాస్ గౌడ్

# తెలుగు కథా పుట్టుక - పరిణామం



- కె.కేశవరెడ్డి

**అంతేగాక 19వ శతాబ్దం ప్రారంభం నుండి అచ్చుయంత్రం వినియోగం విస్తరించింది. పత్రికల సంఖ్య పెరిగింది. పరిశ్రమలలో పనిచేసేవారి పనిభారం పెరిగింది. విశ్రాంతి తగ్గింది. ఫలితంగా ఒక సారి కొద్ది సమయంలో చదవగలిగిన సాహిత్య ప్రక్రియ అవసరమయింది. పెరిగన పత్రికలకు కూడా యిది అవసరమయింది. క్లుప్తత కేవలం రూపానికి చెందిన అంశం మాత్రమే కాదు. 19వ శతాబ్దపు జీవితానికి జీవితదృక్పధానికి కూడా చెందిన అంశం. ఫలితంగా జీవితంలోని ఒక శకలాన్ని తీసుకొని పాఠకుల హృదయాలలో హత్తుకు పోయేవిధంగా చెప్పటానికి కథానిక సాధనమయింది.**

సాధారణ మానవునికి కథ అంత చేరువుగా వచ్చిన సాహిత్య ప్రక్రియ మరొకటి లేదు. అతడి కష్టాలకు సుఖాలకు అనుభూతికి ఆలోచన కదలికకు ఆకారం కల్పించింది కథ. అలాంటి కథ యొక్క ఆవిర్భావానికి పరిణామానికి దారితీసిన చారిత్రక కారణాలను సంక్షిప్తంగా పరిశీలిద్దాం.

పారిశ్రామిక విప్లవం ఇంగ్లాండులో 1770లో మొదలయింది. జేమ్స్ వాట్ ఆవిరియంత్రాన్ని కనుగోన్నాడు. ఆవిరిశక్తిని యాంత్రికశక్తిగా మార్చగలగడం వలన పరిశ్రమల స్వరూపం మారిపోయింది. యాంత్రిక శక్తికి మానవశక్తిని జోడించడం వలన ఉత్పత్తి ఇబ్బడిముబ్బడిగా పెరిగింది. నగరాలలో ఫ్యాక్టరీలు వెలిశాయి. నగరాలకు గ్రామీణ ప్రాంతాలనుండి నిరుపేదల వలసలు పెరిగాయి. పేదల పేదరికాన్ని అవకాశంగా తీసుకొని పెట్టుబడిదారులు తక్కువ కూలీతో ఎక్కువ పని చేయించుకొన్నారు. స్త్రీలు, బిడ్డలు పనిచేయకపోతే కుటుంబాలు గడవని పరిస్థితులేర్పడ్డాయి. పేదలు బానిసల కంటె దుర్భరమైన జీవితాలు గడపవలసి వచ్చింది.

ఉత్పత్తి పెరిగింది. పెరిగిన ఉత్పత్తికి మార్కెట్లు అవసరమయ్యాయి. కొత్త ప్రాంతాల అన్వేషణకు సాహస యాత్రలు సాగాయి. వలసలు, వలసరాజ్యాల స్థాపన జరిగింది.

పారిశ్రామిక విప్లవ ఫలితంగా వచ్చిన సామాజిక ఆర్థిక పరిణామాలు ఆర్థిక శాస్త్రాభివృద్ధికి దారితీశాయి. ఆడమ్‌స్మిత్ రచించిన 'వెల్త్ ఆఫ్ నేషన్స్' 1776లో వెలువడింది. 'ప్రతి వ్యక్తీ తన పెట్టుబడిని ఎక్కువ ప్రయోజనకారిగా ఎలా వినియోగించాలి? - అని నిరంతరం ఆలోచించాలి. అతను ఆలోచించేది తన ప్రయోజనం గురించే, సమాజ ప్రయోజం గురించి కాదు. తన కోసం తను చేసే ఆలోచనలలోనే సమాజ ప్రయోజనం యిమిడి వుంది - అంటాడు ఆడమ్‌స్మిత్. వాణిజ్యంలో ప్రభుత్వ జోక్యం వుడకూడదంటాడు. అంతేగాక వాణిజ్యవేత్త దారిలో గల అడ్డంకులన్నింటినీ తొలగించి అతడి మార్గం సుగమం చేయటం ప్రభుత్వ బాధ్యత అంటాడు. మరొక విధంగా చెప్పాలంటే సమాజ శ్రేయస్సు వ్యక్తి శ్రేయస్సులో యిమిడి వుంది అంటాడు.

'వ్యక్తి తన యిష్టం వచ్చినట్లు చేయటానికి అవకాశం యివ్వు. వీలైనంత లాభం సంపాదించుకోమని చెప్పు, అతడి ప్రయోజనం కొరకే అలా చెప్పి తిరిగి చూడు. సమాజం అంతా బాగుపడుతుంది' అంటాడు. ఆడమ్‌స్మిత్. ఇంకా రికార్డో, మాల్థాస్ జేమ్స్ మిల్, కుల్లాక్ సీనియర్, జాన్ స్టూవర్ట్ మిల్ - లాంటి యితర ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్తలు కూడా తరతమ భేదాలతో యిదే దైన్యం కొనసాగుతాయని, వాటిని తొలగించటానికి చేయగలిగిందేమీ లేదని కూడా చెప్పారు.

ఈ నిరాశావాదానికి భిన్నంగా 1848లో కారల్‌మార్క్స్ ప్రచురించిన కమ్యూనిష్టు ప్రణాళిక సామ్యవాదానికి శాస్త్రీయ మార్గాన్ని చూపింది. పెట్టుబడి కొద్దిమంది చేతుల్లోనే కేంద్రీకృతమవుతుందని శ్రామిక వర్గం దీనిని ప్రతిఘటించి కమ్యూనిష్టు సమాజాన్ని స్థాయించుకోవాలని మార్క్స్ చెప్పాడు. తరువాత దశాబ్దానికి డార్విన్ జీవపరిణామ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. మార్క్స్ ప్రతిపాదనలు మానవుని ఆర్థిక సామాజిక జీవితానికి చెందిన అభిప్రాయాల్ని కుదిపివేయగా, డార్విన్ ప్రతిపాదనలు తాత్విక రంగంలో తీవ్రమైన కల్లోలాన్ని సృష్టించాయి. 19వ శతాబ్దంలో సైన్సు అద్భుతమైన విజయాలు సాధించింది. శాస్త్రీయ పద్ధతి అన్ని రంగాలలోకి చొచ్చుకురావటం మొదలయింది.

ఈ పరిణామాల కారణంగా సమాజంలో నెలకొని వున్న పాతవిలువలు ప్రశ్నింపబడ్డాయి. కొత్త విలువలు ఊపిరులూదుకోలేదు. ఫలితంగా 19వ శతాబ్దపు జీవితమూ, జీవిత దృక్పథమూ ఊహకి

అంతనంతగా మారిపోయాయి. అప్పటివరకు సమాజంలో నెలకొని వున్న స్థిరత్వం భద్రత అదృశ్యమయ్యాయి. జీవితంలోని క్లిష్టత పెరగడం వలన అంతకుముందులాగా జీవితాన్ని మొత్తంగా గాక జీవిత శకలాలను చూడవలసిన అవసరం ఏర్పడింది. జీవితంలోని అభద్రత, ఆందోళన విశ్వాసరాహిత్యాన్ని చిత్రించటానికి కథానిక అవసరమయింది.

అంతేగాక 19వ శతాబ్దం ప్రారంభం నుండి అచ్చుయంత్రం వినియోగం విస్తరించింది. పత్రికల సంఖ్య పెరిగింది. పరిశ్రమలలో పనిచేసేవారి పనిభారం పెరిగింది. విశ్రాంతి తగ్గింది. ఫలితంగా ఒక సారి కొద్ది సమయంలో చదవగలిగిన సాహిత్య ప్రక్రియ అవసరమయింది. పెరిగన పత్రికలకు కూడా యిది అవసరమయింది. క్లుప్తత కేవలం రూపానికి చెందిన అంశం మాత్రమే కాదు. 19వ శతాబ్దపు జీవితానికి జీవితదృక్పధానికి కూడా చెందిన అంశం. ఫలితంగా జీవితంలోని ఒక శకలాన్ని తీసుకొని పాఠకుల హృదయాలలో హత్తుకు పోయేవిధంగా చెప్పటానికి కథానిక సాధనమయింది. ఫోటోగ్రఫి, చిత్రకళ కూడా కథా సాహిత్యాన్ని ప్రభావితం చేశాయి. అంతేగాక గతంలో మేధావులకు మాత్రమే పరిమితమైన మానసిక ఏకాంతత 19వ శతాబ్దపు సంఘటిత జీవితం కారణంగా సాధారణ ప్రజానీకంలో కూడా విస్తరించింది.

19వ శతాబ్దంలో భారతదేశంలో ఆధునిక విద్య, ఆలోచన విధానం వ్యాప్తిచెందడం వలన, విద్యావంతులు ఒక హేతువాద లౌకిక ప్రజాస్వామ్య జాతీయవాద దృక్పధాన్ని అలవరుచుకున్నారు. యూరపుదేశాల్లోని సమకాలీన జాతీయోద్యమాలను అధ్యయనం చేశారు, అభిమానించారు. వారి నుండి ఉత్తేజం పొందారు. బెంగాల్‌లో రాజా రామ్మోహన్ రాయ్ ప్రారంభించిన సంఘసంస్కరణ ఉద్యమం ఆంధ్రదేశంలో తర్వగా వ్యాపించింది. జాతీయభావాలకు ప్రచారంచేసే పత్రికలు ప్రారంభమయ్యాయి. సాహిత్యరంగంలో నవల, కథానికి వ్యాసం లాంటి నూతన సాహిత్య ప్రక్రియలు ప్రజల చైతన్యాన్ని పెచడంలో ప్రముఖపాత్ర నిర్వహించాయి. తెలుగులో కథ నిర్దిష్టమైన సామాజిక ప్రయోజనం కోసమే పుట్టింది. సాంఘిక అవినీతి క్రిములతో నిండిన దుర్భర దాస్యం నుండి మహిళను కాపాడటం, సమాజాన్ని అప్రతిష్ట పాలు జేసే పరిస్థితి చూపించి నైతిక భావాల ఉన్నత ప్రచారాన్ని ప్రాచుర్యానికి తేవటం గురజాడ తన సాహిత్య ప్రయోజనంగా ప్రకటించాడు. మొదటి తెలుగు కథ 'దిద్దు బాటు' రాశాడు. గురజాడ అగుడుజాడని తెలుగు కథకులు అనుసరించారు.

స్వాతంత్రానికి ముందు వచ్చిన తెలుగు కథలో మూడు తాత్విక ధోరణలు కన్పిస్తాయి. ఒకటి కర్మవాదం, రెండు సమిష్టివాదం, మూడవది వ్యక్తివాదం. వాస్తవిక జీవిత చిత్రణ, సంఘసంస్కరణ వస్తువులుగా సాగుతున్న కథలోకి విశ్వనాథ తాత్వికతని ప్రవేశపెట్టాడు.

**సాహిత్యరంగంలో నవల, కథానికి వ్యాసం లాంటి నూతన సాహిత్య ప్రక్రియలు ప్రజల చైతన్యాన్ని పెచడంలో ప్రముఖపాత్ర నిర్వహించాయి. తెలుగులో కథ నిర్దిష్టమైన సామాజిక ప్రయోజనం కోసమే పుట్టింది. సాంఘిక అవినీతి క్రిములతో నిండిన దుర్భర దాస్యం నుండి మహిళను కాపాడటం, సమాజాన్ని అప్రతిష్ట పాలు జేసే పరిస్థితి చూపించి నైతిక భావాల ఉన్నత ప్రచారాన్ని ప్రాచుర్యానికి తేవటం గురజాడ తన సాహిత్య ప్రయోజనంగా ప్రకటించాడు.**

మానవసంబంధాలు కర్మానుబంధాలు మాత్రమేనన్నాడు. మనుషుల మీద సామాజిక సంబంధాల మీద సామాజిక రాజకీయశక్తుల ప్రభావాన్ని కుటుంబరావు, చాసో, గోపీచంద్ తమ కథల్లో చిత్రించాడు. చలం కుటుంబ వ్యవస్థ యొక్క లోపాలపై ధ్వజమెత్తాడు. కాని కుటుంబ వ్యవస్థని ప్రభావితం చేసే ఆర్థిక సామాజిక శక్తుల జోలికి పోలేదు. మునిమాణిక్యం గడపదాటని దాంపత్య జీవితాన్ని ఆదర్శీకరించాడు. తర్కానికి అందని మానవ స్వభావాన్ని వ్యక్తి విలక్షణతను పాలగుమ్మి పద్మరాజు, బుచ్చిబాబు తమ కథల్లో చిత్రించాడు.

1929-34 మధ్య వచ్చిన ఆర్థిక సంక్షోభం, 1939-45 మధ్య జరిగిన రెండవ ప్రచురణ యుద్ధం నేపధ్యంలో జాతీయోద్యమ రాజకీయాలలో గాంధేయవాదం, వామపక్ష భావాల వ్యాప్తి, మతపునరుద్ధరణ ధోరణులు వ్యక్తమయ్యాయి. ఆ తరువాత స్వతంత్రం వచ్చింది. స్వతంత్రానంతర కథారచయితలపై ఈ ప్రభావం పడింది. ఈ తాత్విక నేపధ్యంలో తమ కథలలో సమాజాన్ని పరిశీలించారు, ప్రశ్నించారు, విశ్లేషించారు.

జాతీయోద్యమం ప్రజల ఆశల్ని, ఆకాంక్షల్ని పెంచింది. పరపాలన అంతమైతే అన్నీ అందరికి దక్కుతాయన్నది. ఇకపై కష్టాలు కడగండ్లు వుండబోవన్నది. స్వతంత్రానంతరం ఒక మేరకు విద్యావ్యాప్తి జరిగింది. ఉపాధి అవకాశాలు పెరిగాయి. అభివృద్ధి కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. మరో వైపు గ్రామాలలో పెద్ద రైతులు కొత్తగా ఎదిగి వచ్చిన సంపన్నుల రాజకీయ ప్రాబల్యంపెరిగింది. పేద మారుమూల గ్రామాలకు గిరిజన ప్రాంతాలకు విస్తరించి ప్రాబల్యాన్ని పెంచుకొన్నారు. విస్తరిస్తున్న అధికార రాజకీయ పదవ్యాలలలో యిముద్చుకొనబడ్డారు. మరోవైపు వడ్డీవ్యాపారుల దోపిడితో వర్షాభావంతో చిన్న రైతులు చితికి పోయారు. పేదలు పట్టణాలకు, నగరాలకు వలసబాట పట్టారు. మరికొందరు గల్ఫ్‌దేశాలకు తరలివెళ్ళారు. విద్యాధికులలో మేధోవలస సర్వసామాన్యమయింది. అభివృద్ధిఫలితాలు చేరవలసిన వారికి చేరలేదు. స్వతంత్రపోరాట కాలం నుండి స్వతంత్రం సాధించిన తొలి సంవత్సరాలు నాటి సంస్కరణాభిలాష ఉదారవాదధోరణులు క్రమంగా అంతరించాయి.

ప్రకృతిపరంగాను, వ్యవస్థపరంగాను అభివృద్ధిపరంగాను వచ్చిన పరిణామాలలోని మానవసంబంధాలను, ఘర్షణనూ, వైరుధ్యాలను చిత్రించిన తెలుగకథ ఎంతో వైవిధ్యాన్ని సాధించి అభివృద్ధి చెందింది.

వ్యక్తిని సమాజం నుండి వేరుచేసి పరిశీలించే విధానం నుండి వ్యక్తిని సమాజంలోని భాగంగా పరిశీలించే విధానం వైపుగా కథని నడిపించిన ప్రతిభావంతులైన కథకులు రావిశాస్త్రి, కాశీపట్నం రామారావు. వీరి కధావస్తువులు కధనరీతి, శైలీ తరువాత రచయితల్ని విపరీతంగా ప్రభావితం చేశాయి.

# పొద్దుపువ్వు



- వై.హెచ్.కె. మోహన్‌రావు

నిస్సందేహంగా అది మండుతున్న కొలిమే
ఎగిసి పడుతున్న జ్వాలా తోరణంలా కాంతులీనుతుంది
తూర్పువైపు తొంగి చూసిన వారికి
ధగ ధగ మండే యది ఒకటి తప్పకుండా కనిపిస్తుంది
కవిత్వానికి కొత్త మార్గం చూపిన
ఆ యద అగుపిస్తూనే ఉంటుంది
కాలుతున్న కర ధరహాసంలో
అగ్ని జ్వలిత అక్షర వనం కనిపిస్తూనే ఉంటుంది
తమస్సును దగ్ధం చేస్తూ
విరామమెరుగక పరుగులు తీస్తూనే ఉంటుంది
ఊహల కౌగిలిలో ఊయల ఊగుతున్న
కలాన్ని కదిలించి శ్రమ పొత్తిళ్ళకు చేర్చింది ఆ యద
చిక్కుల మూతులకు చిక్కాలు తగిలించి
తెలుగు పదాలకు వెలుగు చొక్కాలు తొడిగింది
అక్షరాలతో ఆయుధాలు పట్టించి
జన పథాలలో యుద్ధ కవాతు నడిపింది
నిర్వేదాన్ని ఉప్పెనలా ముంచి
ఉరికొయ్యలపై నవ్వులు పూయించింది
ఆ యదకు నూరేళ్ళు నిండినా
అది ఎల్లప్పుడూ పుష్పించనున్న పొద్దుపువ్వే
ఆ కలం కాలానికెప్పుడూ కాస్త ముందే ఉంటుంది
అది! ఎందరో అందుకున్న కలం
మరెందరో ఎంచుకున్న గళం
కాలం కనుమరుగయ్యే వరకూ
కదం తొక్కుతూనే ఉంటుంది
కదం కదంతో 'శ్రీ' కారాలు
మారు మ్రోగుతూనే ఉంటాయి.

---

1980ల తరువాత పర్యావరణసంక్షోభం స్త్రీవాద దళితవాద చైతన్యంపై రచయితలు స్పందించారు. చేపల రొయ్యల చెరువుల కారణంగా వాతావరణ సమతుల్యం దెబ్బతిన్నది. ఒకవైపు కృత్రిమ ఎరువులు నకిలీ విత్తనాలు కల్తీపురుగుమందులు, మరొకవైపు సాధించిన కొద్దిపాటి దిగుబడికి గిట్టుబాటు ధరలు లేకపోవడం వలన చిన్న రైతులు పొలాలు అమ్ముకోవలసి వచ్చింది. కౌలు రైతులు ఆత్మహత్యలకు పాల్పడ్డారు. ఈ సమస్యలపై లోతైన అవగాహనలు మంచి కథలు వచ్చాయి. అలాగే విద్య ప్రవేటీకరణ కార్పొరేటీకరణలతో బిడ్డల మానసిక వికాసాన్ని సమిష్టతత్వాన్ని పెంచడానికి బదులుగా సామాజిక దృక్పథంతో సంబంధంలేని వ్యక్తి వాదాన్ని కెరీరిజాన్ని ప్రోత్సహించే ఆధునిక విద్యపై మంచి కథలు వచ్చాయి. స్త్రీల వ్యక్తిత్వ వికాసానికి అడ్డుగా నిలిచిన పురుషాధిక్య పితృస్వామ్య వ్యవస్థని నిర్దాక్షిణ్యంగా ఖండించిన స్త్రీ వాద రచయితల కథలు వచ్చాయి. మన సాంస్కృతిక జీవితంలోని సంక్షోభం, స్త్రీ పీడనకు వ్యతిరేకంగా పెరుగుతున్న ప్రతిఘటన ఈ కథల్లో వ్యక్తమయింది. వర్ణాధికత్యకు సవాలు చేస్తూ దళిత కథలూ వచ్చాయి.

కథకి దేశం కాలం ప్రాంతాల నేపథ్యం వుంటుంది. కథ ఆ ప్రాంతానికి చెందిన మాండలికంలో రాస్తే కథ పట్ల విశ్వసనీయత పెరుగుతుంది. గురజాడ శ్రీపాద, మాగోఖల్ కరుణకుమార, చాసో, రవిశాస్త్రి, కారా, పతంజలి భూషణం, గౌరునాయుడు బమ్మిడి జగదీశ్వరరావు, బొగ్గవరపు రఘునందన్, పులికంటి కృష్ణారెడ్డి, నామిని సుబ్రమణ్యం నాయుడు, కేతు విశ్వనాథ రెడ్డి సింగమనేని నారయణ, దాశరది రంగాచారు, అల్లం రాజయ్య. బియస్ రాములు, బోయ జంగయ్య లాంటి రచయితలు ఆయా మాండలికాలలో రాయడం ద్వారా కథపట్ల విశ్వసనీయతని పెంచడంతో పాటు భాషపట్ల ఒక ప్రజాస్వామిక దృక్పథాన్ని పెంచటానికి తోడ్పడ్డారు.

పాఠకుల తాత్కాలిక ఉద్రేకాల్ని రెచ్చగొట్టే కథల్ని ప్రచురించే వ్యాపార పత్రికలకు కథలు రాసే కథకులున్నారు. జీవితంపట్ల సమాజం పట్ల స్పష్టమైన భావాజాల దృక్పథం లేకుండా జీవితాన్ని యథాతథంగా చిత్రించిన కథకులూ వున్నారు. కాని తెలుగు కథలో సామాజిక ప్రయోజన దృక్పధానికే అగ్రస్థానం. సామాజిక చలనసూత్రాల పరిజ్ఞానం లేకుండా జీవితపు పైపై మెరుగులను చిత్రించిన కథకులకు తెలుగులో సాహిత్యగౌరవం లేదు.

'తెలుగు కథ - 1960-85,' నవీన్ పాటే నని శివశంకర్‌లు సంకలన కర్తలుగా 1990 నుండి వార్షికంగా ప్రచురించిన కథా సంకలనాలు, అలాగే మధురాంతకం రాజారాం, సింగమనేని నారాయణల సంపాదకత్వంలో విశాలాంధ్రవారు ప్రచురించిన తెలుగు కథకులు - కథనరీతులు కథ యొక్క వస్తువులు శిల్పంలో వచ్చిన వస్తున్న మార్పుల్ని అర్థం చేసుకొనడానికి తోడ్పడతాయి.

# మర్రిచెట్టు



- తెలుగు : ముకుంద రామారావు

- బెంగాలీ మూలం : రవీంద్రనాథ్ ఠాగూర్

చెరువు గట్టున నిల్చున్న, ఓ చింపిరిజుత్తు మర్రిచెట్టా
నీ కొమ్మల్లో గూడుకట్టుకుని నిన్నొదిలి పోయిన పక్షుల్లా
నువ్వు ఆ పిల్లాడిని మరిచిపోయావా

చిక్కుకు పోయినట్టున్న నీ వేళ్ళు
భూగర్భంలోకి ఎలా చొచ్చుకుపోయాయోనని ఆశ్చర్యపోతూ
కిటికీ దగ్గర వాడెలా కూర్చుండిపోయాడో నీకు గుర్తులేదా

చెరువుల్లో నీళ్ళు నింపుకుందుకు స్త్రీలు కుండలతో వస్తే
గాఢ నిద్ర నుండి లేవడానికి తన్నుకులాడుతున్నట్టు
నీ పెద్ద నల్లని నీడ నీటిమీద కదులుతుంటుంది
చిన్న కండెలేవో బంగారు వస్త్రాన్ని నేస్తున్నట్టు
సూర్యరశ్మి అలలమీద నాట్యం చేస్తుంటుంది

అడవి అంచుల్లా కనిపించే వాటి నీడల మీదే
బాతులు ఈదుతుంటాయి
ఆ పిల్లాడు అలానే ఉండిపోయి ఆలోచిస్తుంటాడు

గాలిగా మారి, నీ కొమ్మల సందుల్లోంచి విసురుగా పోవాలని
నీ నీడయి రోజుతో బాటు నీటిమీద పొడుగవుతుండాలని
పక్షి అయిపోయి, నీ ఎత్తైన కొమ్మమీద వాలాలని
నీడలు నాచులతో ఆ బాతుల్లా నీటిమీద తేలాలని

---

# బంజారా నానీలు

- డా॥ సూర్యాధనంజయ్

పురిటి తల్లి
అవిటి తల్లి అయ్యిందే!
ఆగికొట్టుకునే గుండెలా
నా తండా!

చెవులకు అందమైన
బుట్టలోలాకులు
ఆమె గుండెల్లో
కష్టాల మేకులు

లంబాడి ఆడపిల్ల
చంప్లీ
చంపకండిరా
రేపటి చాంపియన్ కావచ్చు



మా తండాలు
మోడు బారిన చెట్లు
అవి కేవలం
మీ అభివృద్ధికి మెట్లు

పెప్సీలెందుకు
పనికొస్తాయి?
యాడి వండిపెట్టిన
లాప్సిముందు

చంప్లీ = పేరు  యాడి = అమ్మ  లాప్సి= పాయసం

---

# త్యాగం అంతకన్నా - ప్రియా!

- సూరారం శంకర్

రాత్రి మంచు కురిసిన వానలో తడుస్తూ తడుస్తూ
తనివితీరా పండువెన్నెలని ఆస్వాదించిన
ఆ క్షణాలున్నాయి చూడు-

మెల్లమెల్లగా తెల్లంచు నీలి ముసుగును తొలగించి
తలెత్తి గోము గోముగా ఓర చూపులతో
చలిని లాలించిన ఆ సందర్భాలున్నాయి చూడు-

తెల్లవారితే యుద్ధం-
శత్రు వికటాట్టహాస రణక్షేత్రాన్ని



ఒంటరి ధిక్కారంతో ఎదుర్కోవాల్సిన
తక్షణ కర్తవ్యం....
రేపు ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసల చిరునామా ఎక్కడో?

సిపాయితో విచ్చుకున్న నీ స్నేహపు
ఆశల ఘోషల జాడలున్నాయి చూడు-

మనసును మనసు పంచుకోలేని జీవితం
జీవితం కాదు -
నేను నీ తలపుల్తో యుద్ధగామినౌతున్నా
నీ కన్నా... నాకన్నా... దేశ రక్షణ గొప్పది
రెండు కన్నీటి బొట్లతో నీవు నన్ను క్షమిస్తే
ఈ దేశమాతకు అంతకన్నా గొప్ప
నివాళులక్కరలేదు
దేహం అశాశ్వతం... ప్రేమ శాశ్వతం....
త్యాగం అంతకన్నా - ప్రియా!

అనువాద
కథ

# అద్భుతం



- ఆంగ్లమూలం : బెన్ హెక్ట్స్
అనువాదం : చీమలమర్రి శ్రీనివాసమూర్తి

**వైద్యవృత్తికి సంబంధించిన ఆ సమావేశానికి ఒక మిస్టరీ వాతావరణముంటుంది. అది అతి గోప్యంగా జరుగుతుంది. మామూలు మనుషులకెవ్వరికి అందులో ప్రవేశముండదు. ఆ సమావేశంలో ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు. అంత పకడ్బందీగా రహస్యంగా జరుగుతుందా సమావేశం.**

అటువంటి రహస్య సమావేశాల్లో న్యూయార్క్ నగరంలోని కొంతమంది ప్రతిభావంతులైన డాక్టర్లు 'ఎక్స్' క్లబ్ పేరుతో పాల్గొంటారు. ప్రతి మూడు నెలలకోసారి క్రమం తప్పకుండా గత యిరవై సంవత్సరాలుగా, వాల్టన్ హోటల్ వెనుక, పూర్తిగా మూసిన తలుపుల వెనక, ఆ రహస్య సమావేశం దాదాపు తెల్లవారుఝాము వరకు నడుస్తూనే ఉంది.

ఈ మధ్య జరిగిన సమావేశం ఒక ముసురు పట్టిన రాత్రి జరిగింది. వర్షాన్ని వాతావరణాన్ని ఏ మాత్రం లెక్కలోకి తీసుకోకుండా పద్నాలుగు మంది సభ్యులున్న ఆ సంఘ సమావేశం పుల్ కోరంతో మొదలైంది. పైగా ఆరోజు ఓ కొత్త డాక్టర్ ఆ సంఘంలో చేరబోతున్నాడు. డాక్టర్ శామ్యుల్ వార్నర్ అతి పిన్నవయసులోనే జీనియస్‌గా పేరు తెచ్చుకున్నాడు వైద్యవృత్తిలో అతని గొప్పతనానికి, వృత్తి ప్రావీణ్యతకు ఆ సంఘంలో సభ్యత్వం దొరకటమే గీటురాయి. అందులో మామూలు డాక్టర్లకు ప్రవేశంవుండదు, యిక సభ్యత్వం ఎలా వుంటుంది. వార్నర్‌ను ఈ 'ఎక్స్' క్లబ్‌లో ప్రవేశించడానికి అనుమతించిన డాక్టర్లందరూ వారి వారి వైద్య విభాగాల్లో నిష్ణాతులు. మరోవిధంగా చెప్పాలంటే ఆ సంఘంలో సగం డాక్టర్లు యువ డాక్టర్ శామ్యుల్ వార్నర్ ఆరాదించే హీరోలే.

**ఎజెండా :**

సమావేశానికి హాజరైన పధ్నాలుగు మంది డాక్టర్ల పరిచయాలు, కరచాలనాలు అయిన తర్వాత డాక్టర్ వార్నర్ ఓ మూలగా తనకు కేటాయించిన సీటులో కూర్చున్నాడు. డ్రింక్స్ అందివ్వబోతే వినయంగా తిరస్కరించాడు. అతని ముఖం ఎందుకో గంభీరంగా, ఏదో వొత్తిడికి లోను అవుతున్నట్లుంది. నిత్యవ్యాయామం తు.చ తప్పకుండా చేసే అతని శరీరం కుర్చీలో నిటారుగా కూర్చుంది. సమావేశంలో పాల్గొనే డాక్టరులా కాకుండా విజిల్‌వేయగానే పరుగు అందుకోవాలనే రన్నర్‌లా వుంది అతని వాలకం.

సరిగ్గా రాత్రి తొమ్మిది గంటలకు, పేరొందిన డయాగ్నోషియన్ విలియంటెక్ సమావేశం ప్రారంభించాడు. "డాక్టర్ వార్నర్! 'ఎక్స్' క్లబ్‌కు ఒక ఎజెండా వుంది. ఈ మన సభ్యులంతా యిక్కడ మూడు నెలలకోసారి సమావేశమవుతారు. ఈ మూడు నెలలకాలంలో వారు చేసిన వైద్యహత్యలను వివరించి, విశ్లేషించి కన్‌ఫెషన్ చేస్తారు.

ఇందులో గత సమావేశానికి ముందు జరిగిన విషయాల ప్రసక్తి ఉండదు. ఇక్కడ హత్యలంటే మెడికల్ మర్డర్స్ అని అర్థం.

మామూలుగా క్షణికావేశంలో కక్షకోసమో, డబ్బుకోసమో, సెక్స్‌కోసమో చేసే హత్యలలాంటివి కావు. డయాగ్నసిస్‌లో జరిగినతప్పువల్లనో, తప్పుడు మందులు సూచించటంవల్లనో, ఆపరేషన్‌లో జరిగిన అవకతవకలవల్లనో రోగి మరణానికి కారణమైన హత్యలు మాత్రమే యిక్కడ చర్చించాలి. పైన చెప్పిన తప్పిదాలు జరిగివుండకపోతే ఆ రోగి కోలుకుని హాయిగా బ్రతికి వుండాల్సిన స్థితి."

"ఇది నా ప్రథమ సమావేశమయినందుకు చాలా సంతోషంగా ఉంది. అయితే నేను ఈ సమయంలో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలనుకుంటున్నాను." అన్నాడు కొత్తగా చేరిన యువ డాక్టర్ వార్నర్.

"అంటే నీవు చేసిన హత్య గురించా? అడిగాడు టెక్.

"అవును"



"గుడ్ కొత్తగా వచ్చిన నీవు చేసిన హత్య గురించి వినటం అందరికి కుతూహలంగా ఉంటుంది. కానీ నీ కంటే ముందు,

ఎజెండాలో రెండు హత్యలున్నాయి. వాటిని ముందు వినాలిగదా! అన్నాడు డాక్టర్ టెక్.

తక్కిన డాక్టర్లంతా అప్పుడు సూటిగా డాక్టర్ వార్నర్ మొఖంలోకి చూశారు. కొత్తగా వచ్చినందున, సహజంగా వుండే బెరుకుతనం గాక మరేదో అతనిమొఖంలో కదలాడుతుండటం గమనించారు. ఈ కొత్త డాక్టర్ తన మొదటి సమావేశంలోనే, ఏదో భయంకరమైన, అనుహ్యమైన హత్యను తన భుజస్కందాలమీద మోసుకు వచ్చాడని అక్కడున్న వారందరికి అర్థమైపోయింది. ప్రఖ్యాత న్యూరాలజిస్ట్ డా॥ పిలిప్‌కర్టిఫ్, వార్నర్ భుజం మీద అనునయంగా చెయ్యి వేస్తూ" నీవు అనవసరంగం హైరానా పడాల్సిన అవసరమేమీలేదు. మేమంతా యింతకంటే ఘోరమైన మెడికల్ మర్డర్ చేసిన వాళ్ళమే" అన్నాడు.

"మిస్టర్ కర్టిఫ్ మీరు డా॥ వార్నర్‌తో మాట్లాడదలిస్తే నిశ్శబ్దంగా మాట్లాడండి. యిది అపరాధభావనతో బాధపడేవారిని బాగుచేసే చికిత్సాలయంకాదు. తమ తమ తప్పులు తెలుసుకునే క్లినిక్ మాత్రమే. మనం చేసిన క్లినికల్ తప్పులను విశ్లేషించుకుని భవిష్యత్తులో యిలాంటి తప్పులు చేయకుండా జాగ్రత్త పడేందుకుద్దేశించిన సమావేశమిది. యిప్పుడు మనముందున్న మొదటి కేసు డాక్టర్ వెండల్ డేవిస్‌ది. ఆయన యిప్పుడు మాట్లాడతారు." అన్నాడు డాక్టర్ టెక్ కొద్దిపాటి కఠినంగా.

పొట్ట స్పెషలిస్ట్ డాక్టర వెండల్ లేచి నిల్చోగానే ఆ హాల్లో సూదిపడితే వినిపించేంత నిశ్శబ్దం నెలకొంది.

"డియర్ ఫ్రెండ్స్! డాక్టర్ వెండల్ డేవిస్ గొంతు సవరించుకున్నాడు.

మొన్న వేసవిలో ఒక రోజు సెనేటర్ బెల్ నుండి ఫోనొచ్చింది. ఆయన తన నియోజకవర్గంలోని పేదలందరికీ డిన్నర్ ఏర్పాటు చేశాడు. అందులో పాల్గొన్న వాళ్ళలో స్టీమ్ యింజన్లు మరమ్మత్తు చేసే హొరోట్జ్ కుటుంబం కూడా వుంది. విందు ముగిసిన తర్వాత కొంతసేపటికి అతని ముగ్గురు పిల్లలు అస్వస్థులైనారు. ఆయన కావిషయం తెలిసి, నన్ను వాళ్ళనోమారుచూడమన్నారు. వాళ్ళయింటికిపోయిముగ్గురినీ పరీక్షించాను. పదకొండు, తొమ్మిది సంవత్సరాల వయసుగల యిద్దరు కొడుకులు చాలా సార్లువాంతి చేసుకున్నారు. వాళ్ళమ్మ వాళ్లు తిన్న పదార్థాల వివరాలిచ్చింది. అందులో చాలా పదార్థాలున్నాయి. పరీక్షించిన తర్వాత వాళ్ళకు ఆముదం త్రాగించండని సలహాయిచ్చాను. కాని ఏడు సంవత్సరాల మూడో కుర్రాడు మాత్రం మిగతాయిద్దరిలా అంతగా ఎఫెక్ట్ కాలేదు. పాలిపోయిన మొఖం. కొద్దిగా టెంపరేచర్ వాంతులయ్యే సూచనలు కన్పించాయి. అంతే కాని అతనికి వాంతులు రాలేదు. చూస్తే అతను కూడా ఫుడ్ పాయిజన్‌కులోనయినట్లు కనిపించాడు. కానీ వాళ్ళంతగా కాదు. ఎందుకైనా మంచిదని అతనిచేతకూడా ఆముదం తాగించాను. కాని మధ్య రాత్రి అతని తండ్రి ఫోన్ చేశాడు. మిగతాయిద్దరు తేరుకున్నారు గాని మూడోవాడి పరిస్థితి సరిగాలేదని చెప్పాడు. చిన్నవాడిలో పాయిజన్ ప్రభావం ఆలస్యంగా మొదలైనందువల్ల ఉదయానికల్లా అంతా సర్దుకుంటుందని నచ్చచెప్పాను. నా ఆముదం చిట్కా వైద్యం పనిచేసినందుకు సంతోషించాను. కాని మరురోజుకు పెద్ద వాళ్ళిద్దరూ పూర్తిగా మామూలైపోయారు గానీ, చిన్నవాడి పరిస్థితి విషమించింది. హైటెంపరేచర్. డీ హైడ్రేషన్ మొదలైంది. కళ్ళులోతుకు పోయి, చూపుమందగించింది. ముక్కుపుటాలు వెడల్పయి, పెదిమలు నీలంరంగుకు తిరిగాయి. చర్మం చల్లబడింది...." డేవిస్ చేప్తూచెప్తూ ఆగాడు.

కొన్ని గంటల్లో ఆ పిల్లాడు చనిపోయాడు. అవునా? ఊపిరితిత్తుల నిపుణుడు డాక్టర్ బల్లన్‌మోరిస్ అన్నాడు చిరునవ్వుతో.

అవునని తల ఊపాడు డెవిస్.

"గుడ్, నీవు మొదటగా ఆ పిల్లాణ్ణి చూసినప్పుడు, అతను ఎపెండిసైటస్‌తో బాధపడుతూ వుండాలి. నీవు తాగించిన ఆముదం ఎపెండిసైటస్‌ను చాలా వరకు 'రప్చర్' చేసి వుంటుంది. నీవు తిరిగి అతణ్ణి క్షుణ్ణంగా పరిశోధించే లోపలే పెరిటోరిస్ మొదలైవుంటుంది" అన్నాడు మోరిన్ మునపటి చిరునవ్వును మొఖంమీద నుండి జారనీయకుండా.

"అవును సరిగ్గా అదే జరిగింది." అన్నాడు దేవిస్.

"అంటే యిది ఆముదం చేసిన హత్య అన్నమాట" అంటూ నవ్వేశాడు. డాక్టర్ విలియంటెక్. తరువాత కేసు డాక్టర్ కెన్నెత్‌ఉడ్‌ది." అంటూ ఎజెండా వైపోమారు చూసి.

ప్రఖ్యాత స్కాట్‌సర్జన్ కెన్నెత్‌వుడ్ లేచినిల్చున్నాడు. అతని దృష్టి అందరిమీద కంటే కొత్తగా చేరిన డాక్టర్ వార్నర్ మీదే వుంది.

"గాల్ బ్లాడర్ (పిత్తకోశం) గురించి మీ అందరికీ తెలుసు. ప్రత్యేకించి చెప్పాల్సి అవసరం లేదు. రోగిని అర్ధరాత్రి తరువాత

తీసుకొచ్చారు. నా దగ్గరికి. కడుపు పై భాగంలో నొప్పిగా వుందని చెప్పింది. యిది ఖచ్చితంగానే బ్లాడర్‌కు సంబంధించిన సమస్యేనని తగ్గటానికి మందిచ్చి పంపాను. కాని తెల్లవారేసరికల్లా నొప్పి ఎక్కువైంది. గాల్‌బ్లాడర్ పెర్‌ఫోరేట్" అయిందనిపించింది. అందుకని ఆపరేషన్ చేశాను. తీరా చూస్తే పిత్తకోశానికి ఎలాంటి సమస్యలేదు. ఓ గంట తర్వాత ఆమె చనిపోయింది." అన్నాడు స్కాట్‌సర్జన్.

అటాప్సీ రిపోర్టులో ఏంతేలింది?" డాక్టర్ స్వీనే అడిగాడు.

"కొద్దిగా ఆగండి. నేను యింకా చెప్పాల్సింది వుంది" అన్నాడు. కెన్నెత్.

"నీవు ఆమె క్లినికల్ హిస్టరీని ముందు స్టడీ చేయలేదా?" అడిగాడు కెర్టిఫ్.

" నో.. అది చాలా ఎమర్జెన్సీ కేసు" అన్నాడు కెన్నెత్ వుడ్.

"అదన్నమాట అసలు సంగతి. మన డాక్టర్ మిత్రుడు నొప్పికి సరైన కారణమేమిటో ముందే తెలుసుకోకుండా ఒక ఆడమనిషిని చంపేశాడు. అటువంటి నొప్పికి గాల్‌బ్లాడర్ కాకుండా మరొక కారణం వల్ల కూడా నొప్పి రావచ్చు......" డాక్టర్ టెక్ మాట పూర్తి కాకుండానే గుండె అన్నాడు డాక్టర్ మోరిస్.



నీవు తొందరపడుతున్నావు.

"రెండో సంవత్సరం మెడికల్ స్టూడెంట్ చేయాల్సిన మర్డరు యిది" అన్నాడు డాక్టర్‌టెక్ కొద్దిగా కోపం మిళితమైన స్వరంతో తరువాత కొత్తగా వచ్చి చేరిన డాక్టర్ వార్నర్ వైపు చూస్తూ–

డియర్ ఫ్రెండ్, మనం యిప్పుడు విన్న రెండు కేసులు మనకేం మాత్రం కొత్త విషయాలను యివ్వలేకపోయాయి. సైన్సు, స్టుపిడిటి రెండూ జోడీగానే వుంటాయని మాత్రం నిరూపించాయి. మనమిప్పుడు క్లబ్‌లో కొత్తగా చేరిన యువ డాక్టర్ వార్నర్ చెప్పబోయే మూడో హత్య గురించి విందాం. అతను చాలా స్వల్పకాలంలోనే అద్వితయమైన ప్రతిభతో పైకి ఎదిగాడు. అతను హత్య చేసి ఉంటే అది చాలా కుతూహలజనకంగా వుండక తప్పదు. బహుశా నా ఆడ విద్యార్థులు ఈ మర్డర్‌ను "ఎహోనీ" అంటారు. అతను యిందాకటినుండి, ఆ మూల ఒక క్రిమినల్‌లాగా ఫీలవుతూ కూర్చున్నాడు. తను చేసిన నేరాన్ని గురించి చెప్పాలనీ గుండెబరువు దించుకోవాలనీ తహతహలాడుతున్నాడు. అతను యిప్పుడు తను చేసిన హత్య గురించి వివరిస్తాడు. మిస్టర్ వార్నర్..ప్లీజ్"... అని కూర్చున్నాడు.

డాక్టర్ వార్నర్ లేచి నిల్చున్నాడు. తడిసిన రుమాలుతో ఒకమారు తన చెమట పట్టిన ముఖాన్ని తుడుచుకున్నాడు. " నా పేషెంట్ పదిహేడు సంత్సరాల యువకుడు పేదవాడు. చాలా పైకి రావలసిన వాడు. చక్కని కవిత్వం రాస్తాడు. నా దగ్గరకు వచ్చే ముందు రెండు వారాల నుంచి అతని ఆరోగ్యం సరిగాలేదు. నేను అతన్ని పరీక్షించిన తర్వాత హాస్పటల్‌లో చేరమని చెప్పాను. మొదట పొట్టకు ఎడమవైపు నొప్పితో అతని అనారోగ్యం మొదలయింది. కాని నాలుగు రోజులు తర్వాత అది తగ్గిపోయింది. అందుకని అతను నా దగ్గరకు ముందే రాలేదు. తరువాత నొప్పి తిరగబెట్టడంతో నా దగ్గరికి వచ్చాడు. ఆ సమయంలో అతనికి కొద్దిగా టెంపరేచర్ వుండటం గమనించాను. మెల్లగా డయేరియా మొదలైంది. జిగట రక్త విరోచనాలు. కానీ అమీబియాగానీ, పాథోజినికే బాక్టీరియాగానీ లేవు. నా దగ్గరకు వచ్చిన పాథోలజీ రిపోర్ట్ చూసిన తర్వాత అల్సరేటివ్ కోలిటిస్ (cerative culitis) గా నిర్ధారణ చేశాను. రోగచిహ్నాలు చూస్తే 'అపెండిసైటస్'గా అనిపించలేదు. అందుకని నేను అతనికి సల్ఫాసలజైన్‌తో పాటు స్వచ్ఛమైన ద్రవాలు యిచ్చాను. కాని మెరుగవటానికి బదులుగా అతని పరిస్థితి దిగజారింది. సాధారణ ఉదరసంబంధమైన టెండర్‌నెస్ 'మొదలై వారం దినాల్లో అతను చనిపోయాడు. ఎంత జాగ్రత్తగా ట్రీట్‌మెంట్ యిచ్చినా అతన్ని కాపాడలేక పోయాను. అన్నాడు విచారంగా.

"శవపరీక్షచేస్తే నీ రోగనిర్దారణ తప్పని తేలింది. అవునా?" అన్నాడు డాక్టర్ ఉడ్.

శవ పరీక్ష జరగలేదు. ఆ పిల్లాడి తల్లిదండ్రులకు నామీద అపారమైన నమ్మకముంది. అభిమానం వుంది. కుర్రవాడికి మల్లే అతని ప్రాణం కాపాడటానికి నేను చేయగలిగిందల్లా చేశానని వారికి పూర్తి విశ్వాసముంది. అందుకని శవపరీక్షకు వారు అనుమతించలేదు.

"అలాంటప్పుడు నీ రోగనిర్దారణ (డయాగ్నోసిస్) తప్పని ఎలా అనుకున్నావు?" అడిగాడు డాక్టర్ హ్యామ్.

"యిది చాలా సింపుల్ నా డయాగ్నోసిస్ సరైనదే అయితే రోగి చచ్చిపోయే వాడు కాదు." హాయిగా లేచి యధాప్రకారం ఆరోగ్యంగా తిరిగేవాడు" అన్నాడు డాక్టర్ వార్నర్ కొద్దిగా విసుగును ప్రదర్శిస్తూ.

"కరెక్ట్ లాజికల్" అన్నాడు డాక్టర్ స్వీనే.

వెల్ ఫ్రెండ్స్ మన టాలెంటెడ్ యంగ్ మ్యాన్ ఒక యువకుడిని, అందునా వృద్ధిలోకి రావాల్సిన వాడిని యమపురికి పంపించేశాడు. అతని డయాగ్నోసిస్‌ని గురించిన విషయం యిప్పుడు మనముందుంది" అన్నాడు టెక్ తన మామూలు వైఖరితో.

"రోగి చనిపోయి ఎంత కాలమైంది?" – డాక్టర్ రాసన్.

"మొన్న బుధవారం.అయినా ఆ విషయం యిప్పుడెందుకు?" – డా. వార్నర్.

"రోగికి నీ మీద పూర్తి విశ్వాసముందని అంటున్నావు. నీవు చేయగలిగిందంతా చేశానంటున్నావు. అయినా నీవు ఎందుకో బాధ పడుతున్నట్లున్నావు. నీ వల్ల ఏదో పొరపాటు జరిగిందనే పాపభావనతో కన్పిస్తున్నావు. దీని మీద పోలీస్ విచారణేమైనా వచ్చిందా?" అడిగాడు డాక్టర్ కర్టిఫ్.

అటువంటిదేమీ లేదు. నేను చేసింది పర్‌ఫెక్ట్ మర్డర్. దీన్ని ఎవరూ తప్పుపట్టలేరు. మీరు కూడా నా "డయాగ్నోసిస్‌లో తప్పు పట్టలేరు." అన్నాడు డాక్టర్ వార్నర్ నిర్మొహమాటంగా.

పిల్ల డాక్టర్ చేసిన ఆ ఛాలెంజి, సభ్యులకు కొంత కోపానికి ప్రేరేపించింది.

"అందులో పాయింట్ వుంది" అన్నాడు డాక్టర్ వుడ్. వార్నర్ వైపు అవహేళనగా చూస్తూ.

"యిందులో చాలా సంక్లిష్టత వుంది. మీరంతా చాలా మామూలు హత్యలు చేశారు. నేను యిప్పుడు విన్నవన్నీ అటువంటివే. కానీ నా నేరం అంత తేలిగ్గా దొరికేదిగాదు" అన్నాడు మరొకమారు సమర్ధిస్తూ.

"డాక్టర్ వార్నర్ కేసు చాలా తప్పుడు డయాగ్నోసిస్ వల్ల జరిగింది. అతను చెప్పిన చిహ్నాలు చాలా యితర రోగాలకు కూడా వర్తిస్తాయి" అన్నాడు డాక్టర్ స్వీనే చాలా మామూలుగా.

డాక్టర్ వార్నర్ గుర్రుమన్నాడు. "దయచేసి మీ అవమానకర వ్యాఖ్యాల్ని కొద్దిగా సైన్సుపరంగా వివరిస్తారా?" అన్నాడు స్వీనే నుద్దేశించి.

"ఉదరసంబంధమైన డెండర్‌నెస్ అంటే పొత్తికడుపు నొప్పి కలగటం చివరి సింప్టంగా చెప్పావు. అంటే అది పెరిటోనిటెస్ (Peritonities) కు గుర్తు" అన్నాడు డేవిస్.



అది అల్సర్ కాని పెర్‌పోరేషన్‌కు దారి తీసింది అన్నాడు స్వీనే.

డాక్టర్ వార్నర్ మరోమారు కర్చీఫ్‌తో మొఖం తుడుచుకున్నాడు.

"కాని అది ఏదైనా వస్తువు ద్వారా రంధ్రం పడిందని అనుకోలేదు" అన్నాడు తనను తాను సమర్ధించుకుంటూ.

"అనుకోలేదు అంటే కుదరదు. అనుకుని ఉండాల్సింది" కటువుగా అన్నాడు డాక్టర్ టెక్ జోక్యం చేసుకుంటూ." మనం అనవసర వాగ్యుద్ధాలకు పోవడం మంచిది కాదు. యింకా చర్చించాల్సింది చాలా వుంది. మరి ఈ రంధ్రం పడటానికి (Perforation)కు కారణం?" అన్నాడు అందరినీ వుద్దేశించి.

"అతను పదిహేడు సంవత్సరాల యువకుడు అందుకని తెలిసి తెలిసి గుండు సూది మింగి వుంటాడని అనుకోలేము" అన్నాడు స్వీనే.

"అది చికెన్ బోన్ అయివుండదు. అదే అయితే అది ocsophagus లోనే అడ్డంపడుతుంది. "పొట్టలోకి జారదు" అన్నాడు డాక్టర్ వుడ్.

అంటే ఈ పెర్‌ఫోరేషన్ వ్యాపించటానికి కారణం Spreading infection అయివుండాలి. అంటే అది అల్సర్ అయివుండదు. అంటే అతను రోగి మింగిన మరోదో వస్తువైయుండాలి. పిన్నులు, చికెన్‌బోన్‌లు కాకపోతే మరేమైయుండవచ్చు" అన్నాడు డాక్టర్ టెక్.

"ఫిష్ బోన్" అన్నాడు స్వీన్.

"తప్పకుండా తప్పకుండా అదే ఐ యుండాలి" తీర్మానించాడు టెక్. డాక్టర్ అందరి వాదనలు వింటూ ముళ్ళ మీద కూర్చున్నవాడిలా ఫీలయ్యాడు. డాక్టర్ టెక్ గొంతు తన తీర్పు వినిపించింది.

"ఇందులో రుజువయింది ఏమిటంటే మన యువ డాక్టర్‌గారు ఆపరేషన్ చేసి చేప ముల్లును తీసివేసేందుకు బదులుగా అల్సర్ వల్ల ఏర్పడిన రంధ్రంగా భావించి ulcerative Colitiris కు ట్రీట్‌మెంటుయిచ్చి ఒక యువకుని నిండు ప్రాణాన్ని నిలువునా ముంచే చేశాడు" అన్నాడు నవ్వుతూ.

డాక్టర్ టెక్ మాటలు పూర్తి కాకముందే డా॥వార్నర్ ఒక్క ఉదుటున లేచి నిల్చుని, తన కోటు, హ్యాట్ పెట్టిన వైపు పరుగెత్తాడు. సభ్యులంతా అతని వైపు కంగారుగా చూశారు.

'అరె! ఏమిటి అప్పుడే వెళ్ళిపోతున్నావు? మీటింగ్ యింకా చాలావుంది" అన్నాడు డాక్టర్ ఉడ్.

నాకు టైం లేదు. నా వాలకంలో ఏదో రహస్యముందున్నావ్. అవును నిజమే నా పేషెంట్ యింకా బ్రతికే వున్నాడు. రెండు వారాలుగా అతని రోగం అల్సర్ వల్ల ఏర్పడిన చిరు గాయాలుగా భావించి మందులు యిస్తున్నాను. అయినా అతనిలో బాగయ్యే సూచనలు కన్పించటంలేదు. నేనేదో ఎక్కడో తప్పుచేశాననే విషయం నాకు అర్థమైంది. మీ అందరి సహాయంతో నేను చేసిన తప్పేమిటో తెలిసింది. మరో యిరవై నాలుగు గంటల్లో ఆపరేషన్ చేసి చేపముల్లును తీసివేయకపోతే ఆ యువకుడు యిక దక్కడు. ఒక యువకుడు ముందు ముందు వికసించబోయే కవి మనకు దక్కడు. మీరు డయాగ్నసిస్ చేసినందుకు అందరికీ కృతజ్ఞతలు నా రోగిని కాపాడటానికి మీరు చేసిన సాయం మరువరానిది. అందరికీ ధన్యవాదాలు" అంటూ బయటపడ్డాడు.

ఒక అర్ధగంట తర్వాత ఎక్స్ క్లబ్ మెంబర్లు పధ్నాలుగు మంది సెయింట్ మైకేల్ హాస్పటల్ ఆపరేషన్ గదిలో వార్నర్ చేస్తున్న ఆపరేషన్ టేబుల్ చుట్టూ చేరారు. ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. నిముషాలు గడుస్తున్నాయి. నర్స్ మౌనంగా పరికరాలు అందిస్తోంది. వార్నర్ గ్లోవ్స్‌కు రక్తం నిండా అంటుకుంది.

వైద్యవృత్తిలో వివిధ విభాగాలలో నిష్ణాతులుగా పేరుగాంచిన పధ్నాలుగుమంది భగవంతునితో సమానమైన డాక్టర్లు ఒక చేప ఎముక ముల్లును మింగిన యువకుని అచేతన శరీరాన్ని చూస్తూ ఆశాపూరితంగా నిల్చున్నారు. ప్రపంచంలోని ఏ చక్రవర్తిగానీ, పోప్‌గానీ, యింతమంది వైద్య నిపుణుల సామూహిక శ్వాస తీసుకోవటానికి నోచుకోలేదు.

అకస్మాత్తుగా చమటలు కారుతున్న డాక్టర్ వార్నర్ తన గ్లోవ్స్ కప్పిన వ్రేళ్ళను పైకి లేపాడు. "దీన్ని కడిగి యిక్కడున్న అతిధులకందరికీ చూపించు అన్నాడు నర్స్‌తో.

అందరికంటే వయసు ఎక్కువైన డాక్టర్ టెక్ ముందుకొచ్చి ఆ వస్తువును నర్స్ చేతుల్లోంచి తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"హు ఒక చేపముల్లు" అన్నాడు నిర్వేదంగా.

'ఎక్స్' క్లబ్ మెంబర్లంతా ఆయన చుట్టూ చేరి దాన్ని చూశారు అదేదో అద్భుతమైన అపురూపమైన వజ్రంలా.

మూడు వారాల తర్వాత ఆ యువకుడు పూర్తిగా కోలుకున్నాడు.

# విప్లవాల గాలివాన

హిందీ మూలం : ప్రొ.టి.వి. కట్టిమణి

అనువాదం : డా॥ జి.వి. రత్నాకర్



రేపు ఈ నేలమీద
నా జనం పర్వతాల్లా నిలుస్తారు
నల్లటి ముఖం
తెల్లటి గడ్డం
మెరిసే కళ్ళు
రేయింబవళ్ళని నరికి
నిద్రని అందిలించిన అతన్ని చూసి
అతని కోపాన్ని చూసి దుప్పటి చీలికలయింది
అతని ఉరుముల నృత్యానికి భూమి కంపించింది
చీమల్లా పాకుతున్న పులులు, సింహాలు గర్జిస్తున్నాయి
ధనస్వామ్యపు గర్వాన్ని ధిక్కరిస్తున్నాయి
కవి వాల్మీకి లక్షల సర్పాల్ని ఊళ్ళోకి వదిలాడు
అవి గ్రామమంతా పాకాయి
పాతాళంలోకి దుమికాయి
ఆకాశానికి గెంతాయి
సంతలో తూనిక రాళ్ళ దగ్గర
చెట్లు సమూహాల ముసుగులో
వ్యాపారుల భవనాల్లో
యజమాని పీఠంపై
ప్రతిచోటా నా జనం
చాప క్రింద నీళ్ళలా వ్యాపించారు
జనం గొంతు గర్జనలైతే
భూస్వాముల గొంతులకి వెలక్కాయలు అడ్డం పడ్డాయి.
జనం అరుపులు వినపడగానే
ధనస్వాముల నోరు ఎండిపోయింది
విప్లవాల గాలి వానలో నా జనం చేయి చేయి కలిపారు
బెత్తాలతో కొరడాలతో అదిలిస్తున్న వాళ్ళ గొంతు పట్టుకున్నారు

పోలీసుల లాఠీలు తార్పుడు గాళ్ళమాటలు
వేద, శాస్త్ర పురాణాలు ఆయుధాల కొట్లలో
ఎండుటాకులై చెత్త కుప్పల పాలయ్యాయి
విప్లవాల గాలి వానలో కొట్టుకుపోయాయి
తిరుగుబాటు జన సంద్రంలో కలిసి
వేల నదులు పొంగి పల్లవించాయి

---

# హిపోక్రట్

- రాణీపులో మజాదేవి



బాగా ఆలోచిస్తే
ఈ ప్రపంచంలో...
అతి పెద్ద హిపోక్రాట్ అద్దమే!
మన ముఖమెంత ముదిరిపోయినా
స్కిన్‌టోన్ అద్భుతం అనిపించేలా చూపిస్తుంది.
మన ముఖం వైపు మరోసారి మరెవ్వరు చూడకపోయినా...
మనం మాత్రం మాటిమాటికి చూసుకునేలా చేస్తుంది.
మన బదులు ఐశ్వర్యారాయ్ మిస్ వరల్డ్ ఎలా అయ్యింది?
అని ఆశ్చర్యపోయేలా చేస్తుంది.
అభిషేక్ నాకన్నా అందగాడా ఐష్ వరించడానికి?
అనే ఆలోచనను కలిగిస్తుంది.
లంబోదరులకు, గజకాయులకు
'పర్లేదు, మరీ లావేం లేవు అని ఓదార్పునిస్తుంది
బ్రహ్మానందానికి 'బిగ్‌బి' ననే ఫీలింగును
కోవై సరళకు కరీనా కళను కలగజేస్తుంది
వర్ణ భేదాలు, వయసు తేడాలు
ఏ మాత్రం తన హిపోక్రసీని కరిగించలేవు.
ఎందుకంటే...
అద్దం మన ప్రతిబింబం.
అంటే అంతరాత్మకు ప్రతిరూపం.
అదే ఇచ్చింది దానికి ఈ నొప్పించని నైజం.
అందుకే అద్దం....
అతి పెద్ద హిపోక్రాట్
ఇది నిజం




# "మాటే మంత్రమూ...."

- వి. ప్రతిమ

ఈ ప్రపంచంలో మిగిలిన అన్ని జీవరాసుల నుండి మనిషిని వేరు చేసేది కంఠస్వరమే..... ఆ స్వరం లోంచి వెలువడే మాట అంతరంగంలో నిక్షిప్తమై వున్న భావాల్ని, స్పందనల్ని, సంవేదనలనీ వ్యక్తం చేయడానికి మనిషికి మాత్రమే వున్న ఒకానొక అవకాశం.....

మిగిలిన జీవరాసులు కూడా కొన్ని సంకేతాల ద్వారా తమ భావాల్ని వ్యక్తం చేసుకోగలవేమో గానీ యింత స్పష్టంగా, యింత మధురంగా యింత జీవన వికసనంగా అయితే కాదు.....

ఈ మాటలు మనిషి జీవితానికి ఎంత వరాలో, ఎంత ప్రేమమూలాలో, ఎంత మణికిరీటాలో, ఎంత శూలాలో, ఎంత తిమిరాలో ఎంత గాయాలో కూడా వివిధ స్థాయిల్లో నుంచి వ్యక్తీకరిస్తాడు కవి చిన్ని నారాయణరావు 'మాట' అన్న ఈ దీర్ఘకవితలో....

నెల్లూరు జిల్లా నుండి ఒక నిబద్ధతతో, సామాజిక బాధ్యతతో ఆధునిక కవిత్వాన్ని వెలువరిస్తోన్న అతి కొద్దిమంది ప్రముఖ కవుల్లో నారాయణరావు ఒకరు. ఆయన రాసిన ఈ దీర్ఘ కవితలో వివిధ సామాజిక చలనాలు ఎలా మాటల రూపంలో వ్యక్తమవుతాయో చిత్రిస్తాడు...బహుశా తెలుగు సాహిత్యంలో 'మాట' అన్న అంశం మీద వచ్చిన తొలి దీర్ఘకవిత యిదే కావచ్చు...

ఈ కవిత్వం చదువుతున్నపుడు మాటలు ఒక్కొక్కసారి ఎంత మేజిక్కులు చేస్తాయో ఒక చిన్న పిట్టకథ గుర్తొచ్చింది. ఒక తెలుగు బిచ్చగాడు, ఒక తమిళ బిచ్చగాడు ఒక రాత్రి ఒక సత్రంలో పడుకున్నారు. తెల్లవారి తన కర్రను తీసుకుని లేవబోతూండగా ఆ కర్ర కున్న దారం తమిళ బిచ్చగాడి చెవికి చుట్టుకుని బిగుసుకుపోయింది. తెలుగువాడు కర్ర తీసుకోబోతే 'కాదు కాదు' అన్నాడట తమిళ బిచ్చగాడు. ఇతడేమో 'నాది నాది' అన్నాడట.. తమిళంలో కాదు అంటే చెవి అని అర్థం. మాటల గారడీకి ఈ పిట్టకథ చెప్పుకుని సరదాగా నవ్వుకుంటారు మా ప్రాంతంలో...

మనం మామూలుగా మౌనం ఒక అభరణం అనుకుంటాం గానీ మాట కూడా మనిషికి ఒక అద్వితీయమైన ఆభరణంగా భాషిస్తుందని చెప్పాడు కవి...

'మాటే మనిషికి మణి మకుటం
మాటతోనే మనిషికి కీర్తి కిరీటం
మాటే మనిషికి అద్వితీయ ఆభరణం
మాటతోనే మనిషి మకుటాయమానం' అంటాడు.

ఈ క్రమంలో అమ్మ, నాన్న, మిత్రుడు, భార్య ....జీవనవిజయం, వ్యాపారతత్వం, కమ్యూనికేషన్

స్కిల్స్, వ్యక్తిత్వవికాసం, రైతు, కార్మికుడు, మట్టి, శ్రమ...యిలా అనేకానేక సామాజికాంశాలని, కుటుంబ సంగతులనీ కూడా వివిధ కోణాల్లో నుండి వ్యక్తం చేస్తారు. వీటన్నింటికీ కూడా మాటలే కదా ఆధారం...

"కడివెడు కష్టాలనీ
కన్నీరు చారికలనీ
ఒక్కసారిగా చెరిపి వేసేది
అమ్మ పలికే పలుకుల
దీవెనెలతోనే కదా
ఆమె మాటే కదా మనకు
బతుకంతా తోడూ నీడ"

'అమ్మ' అన్న పదం ఒక కాగితం మీద రాస్తే చాలు అదే ఓ గొప్ప కవిత అంటారు ప్రముఖ నానీల కవి డా॥గోపీ. అమ్మ మీద ఎందరో రాశారు కానీ నారాయణరావు అమ్మ మాటల మీద రాసిన ఖండిక విలక్షణమైనది....అలాగే తాను గుర్రమై కొడుకును దౌడు తీయించే తండ్రిని గురించి

"నాన్న మాటలతోనే కదా
లోకం మనకు దృశ్యాదృశ్యమై
కనులకు కన్పట్టేది
నన్ను చదువులకు పంపుతూ నాన్న
శ్రీరాముడిని అడువులకు పంపేటప్పటి
దశరథుడయ్యాడు" అంటూ అప్పటికప్పుడు చదువరుల కనుగుడ్ల మీద నీటి తెరవుతాడు కవి..

మరి తల్లితండ్రులేనా? భార్య?

భార్య ఎలా జీవితంలో సగభాగమై వెలుతురు వెన్నెల జలపాతాన్ని వర్షిస్తుందో ... ఎలా కరణేషు మంత్రిగా భాసిల్లుతుందో ఎట్లా అనేకమైన కౌటుంబిక, కుటుంబేతర అంశాల మీద నిర్ణయాలు ప్రోది చేసి శ్రీవారి పరిశీలనకు నివేదిస్తుందో.. ఆ మాటలు జీవితాల్లో ఎటువంటి వసంతాల పంటలను పండిస్తాయో కూడా చెప్తాడు. తెలివైన ఇల్లాలి మాట ఆ కుటుంబ బాటకు శ్రీరామరక్ష అంటూ మన కుటుంబాల్లో స్త్రీల పాత్రని ఒక సమున్నత స్థాయిలో నిలబెడతాడు.

# నాకూ రాయాలనే ఉంటుంది

- కాశీవఝ్ఝుల రమానరసింహం

నాకూ రాయాలనే ఉంటుంది
చుక్కల నీలాంబరి నుండి
స్నిగ్ధంగా జాలువారే
చంద్రజ్యోత్స్న కిరణాల గురించి
అవి పరచిన
వెన్నెల తివాచీ మీద
మైమరచిన కోర్కెల జోడు గుర్రాల్లాంటి
యువక జంటల ప్రేమైక చేష్టల గురించి
వారిని
చూపులతో జుర్రుకునే
జాబిల్లి
గడుసరి బడాయితనం గురించీ
కానీ
దావాగ్నిలా మండే బ్రతుకుల ఆశయాల
ఉసురులకి ఎల్లవేళలా
వెన్నెల సజీవ జీవచైతన్యం కావాలని
వెలుగులోకాల కోసం
మూసుకున్న గవాక్షపు
చీకటి గదులలో
ఒంటరి అంకెలాంటి ఏకాకి తనాలు
ప్రపంచీకరణ నేపథ్యంలో
డాలర్ గాడి
వికట కపట
నటనా పటం ఘటాఘటనాత్మక యుద్ధంలో
బలిపశువులైన
అనాథ అన్నార్తుల మౌనరాగాలు....



ఆక్రోశపు ఘోషలుగా
గుండెను ఛిద్రం చేస్తుంటే
శృంగార రసోద్దీపనాక్షర రేఖల్ని
స్వరించలే ననుస్వరించలేను
అయినా
చంచల మనస్సుకి రాయాలనే ఉంటుంది....!

మైదానపు ఆటస్థలాలపై మొలిచే
కాంక్రీటు సౌధాల నడుమ
పరుగులెట్టలేని
పసితనపు దిగుళ్లూరే చూపుల గురించి
రాయాలనే ఉంటుంది

సరిగ్గా అప్పుడే
ఆటపాటలకు దూరంగా
నిగారింపే లేని
కసుగందని పూల దండలాంటి
బాల్యపు పరిమళం రవ్వంత కూడా
చవి చూడని
చిన్ని యకిలి చేతులతో
కుప్పల మధ్య
ఆత్రంగా తడవుకు లాడే
మురికి బాల్యపు అనాథత్వాల
అనాచ్ఛాదిత వైఖరుల నడుమ
మధ్య తరగతి బాల్యపు
బిత్తర చూపుల్ని స్పృశించలేను
మళ్లీ మళ్లీ....
సిమెంటు గోడల పాలిట
బుల్డోజర్లయితే తప్ప

---

అయితే ఈ మొత్తం మాట చైత్రం, చైతన్యం అంతా గురువు దగ్గర్నుండి నేర్చుకున్నదే కదా..ఇక్కడ మాటే నిత్యం చైతన్యంగా జీవితంగా, విలువలుగా మార్చబడుతుంది, మలచబడుతుంది అన్న విషయాన్ని మనిషి గురువుకు చెయ్యెత్తి మొక్కవలసిన అవసరాన్ని ఖచ్చితంగా వివరిస్తాడు. మరి యిదంతా ఒక ఎత్తయితే .. ఈ నేర్చుకున్న చైతన్యంతో మనిషి ఒక మహోన్నతమైన సమాజాన్ని ఎలా సృష్టించుకుంటాడు అంటే

"మాట చుక్కాని
అయిన చోట
సంఘం సర్వ సన్నద్ధమవుతుంది.
సమాజం సారవంత మవుతుంది
నీతి నిజాయితీలు
పరిఢవిల్లే పుడమిగా
జాతి జాగృతమవుతుంది
ఎటు చూసినా సుభిక్షం
ప్రగతిదారుల్లో క్షేమం
చిగురాకు తొడుగుకుని
క్షామం కానరాని లోకం
సాక్షాత్కరిస్తుంది."

నీతి, నిజాయితీ, నిబద్ధత, ప్రేమ, క్షమ, దయలతో మనం వున్నట్టయితే సుందరోద్యానవనాలని కలగన వచ్చునని, ....మన ముందు ఒక ఉన్నతమైన సమాజం సాక్షాతరిస్తుందని కవి ఉద్దేశం.. అందుకోసం మనం మాటలని చుక్కానిగా ఉపయోగించాలి..

మనిషి క్రమక్రమంగా తన జీవితాన్ని మెరుగుపరుచుకోవటానికీ.. విముక్తిని సాధించుకోవటానికి చేసిన పోరాటాలు, ఉద్యమాలకీ ఆధారం ఈ మాటలే కదా..అటువంటి వైష్ణవ్యగీతాలని గురించి కూడా కవి ఉదహరిస్తాడు...

మాటంటే మాటలు కాదని మనందరికీ తెలుసు... 18 ఖండికలుగా రాయబడ్డ ఈ దీర్ఘకవితని చదివిన ఏ మనిషయినా తమ మాటతీరును మార్చుకొనక తప్పదు..మాటల పొదుపును అనుసరించక మానడు....ఈ కవి కలం నుండి చైతన్యవంతమైన మరింత కవిత్వాన్ని పాఠకులు నిస్సందేహంగా ఆశించవచ్చు.




## కొత్త బతుకు (కథల సంపుటి)

- పాలకొల్లు రామలింగస్వామి

వెల : రూ.70/- పేజీలు : 103

**ప్రతులకు : 9032604485**

ఈ సంపుటిలో ప్రత్యేకత కలిగిన కథ... 'కత్తెర'. వార్ధక్యం కారణంగా క్షురక వృత్తిని చేయలేని తండ్రికి బదులు పూట గడవడానికి అందమైన ఆదిలక్ష్మి పొది పట్టుకొని పనికి బయలుదేరుతుంది అందరూ ఆశ్చర్యపోయేలా! "బస్సుల్లోన.., బడుల్లోన..., ఆఫీసుల్లోన... ఆసుపత్రు ల్లోన.. మగోళ్ళతో సమానంగా ఆడోళ్ళు లేరేటి... ఉజ్జోగాలు సెయ్యలేదేటి? ఇది కూడా అంతే. ఇందులోన తప్పేటుంది? అని అంటుందో పాత్ర ఆదిలక్ష్మి గెడ్డాలు గీయడం గురించి. ఇందులోని ప్రతీ కథ ఏదో ఒక సమస్యను తీసుకుని రాసిందే. అన్ని కథలు అట్టడుగు జీవితాల పట్ల ఆర్తితో చిత్రించినవే. నిరంతర అధ్యయనం... నిరంతర పరిశీలనతో ఈ కథకుడు మరిన్ని కథలు పదునుగా రాయగలడనే ఆశను కలిగిస్తున్నాయి ఈ కథలు.

- గంటేడ గౌరునాయుడు




## మానుషం (రచనా సంకలనం)

- రోశయ్య రామిశెట్టి

వెల : రూ.100/- పేజీలు : 120

**ప్రతులకు : 9390279127**

వర్తమాన సమాజంలో జరిగే ప్రతి సంఘటనను కవి పట్టించుకున్నారు గనుక వస్తు వైవిధ్యం పెరిగింది. కళ్ళ ముందు జరుగుతున్న వాటిని ఎరుకలో గ్రహించడం, పరిశీలించడం, విశ్లేషణ, మార్క్సిజం పట్ల అచంచల విశ్వాసం కవికి ఉన్న కారణంగా దృక్పథం స్పష్టంగా ఉండటమే కాకుండా దృక్పథానికి నైనిత్యం కూడా జతకూడింది. ఈ రెండింటికి కావలసిన అనుభూతి, ఆర్ద్రతలు కవి అంతరంగంలోని కారుణ్యం వల్ల ఈ కవితలకున్న తడి, చెమ్మ గుండెకూ కలుగుతాయి.

- సీతారాం




## జవాబు తెలియనివాడు (కథలు)

- యస్. మునిసుందరం

వెల : రూ.100/- పేజీలు : 118

**ప్రతులకు : 0877-2220769**

మొత్తం మీద చూసినప్పుడు ఈ సంపుటిలో ఉన్న కథలన్నీ ఆసక్తికరంగా చదివించేవే. తాను ఏ ఇతివృత్తంతో కథను చెప్పినా, దానికి తగిన కథా శిల్పాన్ని సమకూర్చుకోగల శక్తి రచయితకు ఉంది. ఈ సంపుటిలోని కథలేవీ మంచికి హానీ, చెడుకు సాయమూ చేసే కథలు కావు. ఆ దృష్ట్యా చూసినపుడు రావిశాస్త్రిగారన్నట్టు ఆదరించదగ్గ కథలే అవుతాయి.

- కోడూరి శ్రీరామమూర్తి




## చందమామ రావే (బాల గేయాలు)

- డా॥ పత్తిపాక మోహన్

వెల : రూ.50/- పేజీలు : 60

**ప్రతులకు : 09811239219**

ఇది ముప్పై ఆరు పాటల పేటిక. ఇందలి పాటలన్నీ బాలబాలికలకు ఉపయోగపడే వివిధ విషయాల వివరణలవి. కొన్ని చిన్నారులపై వారి కన్నవారి ప్రేమను వ్యక్తపరిచే కుటుంబ వాతావరణపువి. మరికొన్ని విద్యాలయ పరిధిలోవి. ఈ పుస్తకంలోని పాటలన్నీ సదాశయాలవి - బాగున్నవి. కొన్ని మరీ బాగున్నవి. యతి ప్రాసల విషయంలో మరింత శ్రద్ధ చూపవలసి ఉండె. వీటిలోని భాషా సారళ్యం, కవన నైపుణ్యం, బాల బాలికల హృదయాలను హత్తుకుంటవి.

- డా॥ మలయశ్రీ




## కొంచె తూర్పు - కొంచెం పడమర

(కథల సంపుటి)

- పోడూరి కృష్ణకుమారి

వెల : రూ.130/- పేజీలు : 262

**ప్రతులకు : 9441226880**

మధ్యతరగతి కుటుంబాల జీవితాల్ని కేంద్ర బిందువులుగా చేసుకున్నా, సుభాషితాలుగానో, నీతి వాక్యాలుగానో కాకుండా ఆసక్తికరంగా చదివించగల నేర్పుతో, స్ఫూర్తితో గుర్తుంచుకోదగ్గ కథలను రాశారు కృష్ణకుమారి. కథకులు వైతాళికులుగా, క్రాంతిదర్శనులుగా రచనలు చేసినప్పుడు ఎంతో ప్రయోజనాత్మకతను ఆపాదించుకుని ఆ రచనలు పాఠకుల్లో బలమైన దృష్టి కోణాన్ని తెస్తాయి.

- అంబికా అనంత్




## నిషాదం (కవిత్వం)

- 'మో'

వెల : రూ.100/- పేజీలు : 186

**ప్రతులకు : నవోదయ పబ్లిషర్స్ అన్ని బ్రాంచీలు**

సామాన్య పాఠకుడు రచనని అర్థం కంటే అపార్థం ఎక్కువగా చేసుకుంటా డంటాడు హెరాల్డ్ బ్లూమ్. రచనలో అస్పష్టత ఉంది అని సామాన్య పాఠకుడు చేసే అభియోగానికి ఇదే మూలం. చదవడం అనే తన సొంత అలవాట్లకి లోనయిన పాఠకుడు రచనలో అస్పష్టతని మాత్రమే చూడగలడు. సంక్లిష్ట కవిత్వాన్ని అస్పష్ట కవిత్వంగా మాప్ ఆఫ్ మిస్ రీడింగ్‌గా అపార్థం చేసుకుంటాడు.

- 'మో'




## అథో జగత్ సహోదరి (నవల)

**- అక్కినేని కుటుంబరావు**

**వెల : రూ.40/- పేజీలు : 94**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు) మరియు అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో**

1960 నుంచి 80ల వరకూ గల కాలంలో వ్యభిచారంలోకి బలవంతంగా నెట్టబడ్డ స్త్రీల పరిస్థితిని, వారి చుట్టూ హింసా వలయంలా ఉన్న పోలీసు, న్యాయ వ్యవస్థలను అథో జగత్ సహోదరి'లో అక్కినేని కుటుంబరావు వాస్తవంగా చిత్రించారు. నవలంతా రచయితకు ఈ వ్యవస్థ పట్ల ఉన్న కోపం బలంగా ప్రకటితమవుతుంది. పాఠకులు కూడా ఆ ధర్మాగ్రహంలో భాగమైపోతారు. ఆ రకంగా రచయిత తను సాధించదల్చిన ప్రయోజనాన్ని అతి సులభంగా సాధించారు.

**- ఓల్గా**




## చిలకలు వాలిన చెట్టు (కథలు)

**- జి. వెంకటకృష్ణ**

**వెల : రూ.50/- పేజీలు : 171**

**ప్రతులకు : 89850 34894**

వెంకటకృష్ణ తన కథలన్నింటిలో రాయలసీమలోని అనంతపురం, కర్నూలు జిల్లాలలోని మాండలిక పదాలను వాడటం వలన ఈ కథలకు స్థానిక పరిమళం అలవడింది. ఈ కథల్లోని మాండలికాలు, భాషలోని యాసను యథాతథంగా ఉపయోగించడం రాయల సీమేతరులను ఆశ్చర్యానికి గురిచేస్తే, రాయలసీమ వాసులకు ఆత్మీయ స్పర్శను అందిస్తాయి.

**- డా॥ కె. శ్రీదేవి**




## జారుడు బండలు (కథలు)

**- కూతురు రాంరెడ్డి**

**వెల : రూ.100/- పేజీలు : 156**

**ప్రతులకు : 9000415353**

కథకు తప్పనిసరిగా ప్రయోజన ముండాలన్న ఆ కృతిని చదివిన తర్వాత పాఠకుడు జ్ఞానరీత్యా ఉన్నతీకరించబడాలని ఆశించే పాఠకులందరకు ఈ కథలు తప్పనిసరిగా నచ్చుతాయి. ఎందుకంటే దీంట్లోని ఏ కథా ఉబుసుపోక రాసిన కథ కాదు. ప్రతి కథా ఏదో ఒక సామాజిక సమస్యను తీసుకొని విశ్లేషించి ఒక పరిష్కారం దిశను సాగి ముగుస్తుంది. ఇది ఒక సులక్షణం. కథను సాఫీగా చదివించగలగడం మరో మంచి గుణం. కూతురు రాంరెడ్డి రెండవ కథా సంపుటిగా వస్తున్న ఈ 'జారుడు బండలు' కథల్లో అతని మొదటి కథా సంపుటి 'కొత్త చివుళ్ళు'తో పోల్చి చూసినపుడు ఎంతో పరిణతి కన్పిస్తుంది.

**- రామా చంద్రమౌళి**




## లోకాయత

**అసుర దృక్పథం • తంత్రవాదం • శునకాల మంత్రాలు**

**- దేవీప్రసాద్ చటోపాధ్యాయ**

**వెల : రూ.70/- పేజీలు : 192**

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

అసలు 'లోకాయత'కూ మిగతా తత్వశాస్త్రాలకూ మరో స్పష్టమైన తేడా వుంది. మిగతా 'నాగరిక' తత్వశాస్త్రాలకు ఒక మూలపురుషుడు - తాత్వికుడు - అనేక మంది వ్యాఖ్యాతలు ఉంటారు. 'లోకాయత' అలాంటిది కాదు. సామాన్య జనం లోకాన్ని, లోక లక్షణాలను అర్థం చేసుకున్న తీరు... 'లోకాయత'. నిజం చెప్పాలంటే అది 'అనుకోకుండా' తరతరాల సామాన్య జనం చేసిన 'ఆలోచనల సంపుటి' 'లోకాయత'కు కొన్ని విశ్వాసాలు, అభిప్రాయాలు, ప్రవర్తనా సంప్రదాయం ఉంటుంది. వాటిని... ప్రత్యర్థుల గ్రంథాలలోంచి అపార్థాలను వివరించి - తొలగించి - ఉద్ధరించడమే దేవీప్రసాద్ చటోపాధ్యాయ చేసింది.

**- హరి**




## జ్ఞానం - విజ్ఞానం
## మానవ చరిత్ర ప్రస్థానం

**శాస్త్రజ్ఞులు . తాత్వికులు . యోధులు**

**- మైకేల్ ఇలిన్ & ఐ. సెగాల్**

**వెల : రూ.80/- పేజీలు : 228**

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

రష్యన్ వైజ్ఞానిక రచయితలు ఇలిన్ & సెగాల్‌లు అత్యంత సుబోధకంగానూ, శాస్త్రీయంగానూ రచించిన మానవ చరిత్ర పుస్తకాల పరంపరలో ఇది రెండవది. మహీధర సోదరుల మహత్తర కృషి ఫలితంగా ఇవి అరవయ్యేళ్ళ క్రిందటనే తెలుగు పాఠకులకు అందుబాటులోకి వచ్చాయి. ప్రకృతితో సంఘర్షణలో మనిషి ఎలా నిలదొక్కుకున్నాడదన్నది అందులో ఇతివృత్తమైతే అతని జీవితానుభవం ఏ విధంగా వైజ్ఞానిక ఆవిష్కరణలకు దారితీసిందనేది ఈ భాగంలో చదువుతాము. సుపరిచితమైన విజ్ఞాన విషయాలు వెనక వున్న చరిత్ర పరిణామ క్రమం, ఉత్పత్తి శక్తుల పాత్ర ఈ రచనలో మనకు తెలుస్తుంది.

**- ప్రచురణకర్తలు**




## అక్షర వృక్షాలు (పర్యావరణ కవితలు)

**- డా॥ జె. బాపురెడ్డి, డా॥ ఎస్వీ రామారావు, డా॥ వోలేటి పార్వతీశం**

**వెల : రూ.100/- పేజీలు : 119**

**ప్రతులకు : 96769 57000**

**(విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

కాలుష్యాలన్నిటిని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో హరించే శక్తి చెట్టుకు ఉన్నది. ఆ చెట్టు కేంద్రబిందువుగా అనేకమంది కవులు ఆవిష్కరించిన భావసత్యాలు, ఆత్మ ప్రబోధాలు, వారు నాటిన 'అక్షర వృక్షాలు'గా అందిస్తున్నాం. "కుక్కపిల్ల సబ్బు బిళ్ళ" ఏదైనా కవితా వస్తువు అయిన విషయం మనకు తెలిసిందే. మానవ సంస్కృతికి, సభ్యతకు ఆయువు పట్టైన చెట్టును. మానవాభ్యుదయానికి సోపానంగా కవులు అభివర్ణించారు. "పర్యావరణ పరిరక్షణ" పరమైన వైరుధ్యం లేని భావ వైవిధ్యం ఈ అక్షర వృక్షాలలో పరిమళించి ఫలించింది.

**- డా॥ జె. బాపురెడ్డి**

# రెక్కలు

- డా॥ మౌని



రెక్కల్ని ప్రేమించేవాడికి
ఆకాశమే హద్దు
ఆశయంతో బ్రతికే వాడికి
గెలుపు మాత్రమే ముద్దు -

ధ్యేయం జీవితాన్ని
వెలిగించే దీపం.

ఆ..చిత్రపటంలో అమ్మ
ఒదిగి కూర్చుంది.
ఈ చిన్ని గుండెలో
ఆమె పంచిన ప్రేమ వెలుగుతోంది -

ఒక తడి జ్ఞాపకం చాలు
జీవితాన్ని పండించేందుకు

ఖడ్గంతో
ప్రేమలేఖ రాసి
'కామం'
ప్రేమను హత్యచేసింది -

జనారణ్యంలో
అబల చావుకేక

రాజకీయపు కుంచెతో
కులాలరంగుల చిత్రం
దేశంలో 'అంటరానితనం'
బొమ్మకట్టిన ఒక ఇంద్రధనుస్సు -

దళితముద్ర...వ్యవస్థపై
ముద్రించిన రాజముద్ర

మంచితనం కూడా
చేతగాని తనమే
హృదయం లేని
మనుషుల ముందు -

పందులకు..
పన్నీటి పరిమళం రుచించదు.

శబ్దాన్ని పలకరించు
నిశ్శబ్దం బ్రద్ధలౌతుంది
చీకటిని తట్టిలేపు
వెలుగు విచ్చుకుంటుంది -

చైతన్యం...
సృష్టి మనుగడ

దుష్ట శిక్షణ
శిష్ట రక్షణ
జరిగి తీరాల్సిందే
ధర్మసంస్థాపన కోసం -

సమసమాజ నిర్మాణం
సర్వ జన శ్రేయం
అగ్గిపుల్లకు....
పేదవాడికి....కడుపుతరుక్కుపోయి
తల మాత్రం వుంటుంది
రగిలేందుకు.. -

అణువుచాలు...
విస్ఫోటించేందుకు

దప్పిక తీర్చేది...
'గంగ'
సముద్రుడు
కాదు కదా! -

దాతృత్వం
శాశ్వత స్మరణీయం.

గులాబి పువ్వేకాదు
గడ్డిపువ్వు విచ్చుకుంటుంది
అమ్మ లాంటి
మట్టి ఒడిలో -

ప్రకృతి ప్రేమలో
అభేదం

ప్రేమ, సేవ, త్యాగం
నువ్వు పంచేంతవరకు
అవి ఎప్పటికీ
నీకు దక్కవు... -

విత్తును బట్టే కదా..
చెట్టు.

# మకుటం లేని మహారాజు

- ఇరువింటి వెంకటేశ్వరశర్మ



ఎవరి ఎజెండాలో లేనివాణ్ణి
ఏ జెండాకు పట్టని వాణ్ణి

గాయాలెన్ని అయినా
ఖరీదైన ముసుగులో
ఇంటినీ ఒంటినీ దాచుకుని
వర్తమానంలో అడుగులు వేస్తున్నవాణ్ణి

నా జీవిత విచిత్ర కథలో
వెలిసిపోయిన రంగులద్దుకుంటూ
చిరిగిన పుటలను సవరిస్తూ
చరణాలు లేని పల్లవిని పాడుకుంటూ
కాలంతో పాటు పరుగులు తీస్తున్నవాణ్ణి

నేనంటే ఎవరికీ జాలిలేదు
ఒక్క కాలానికి తప్ప
మళ్ళీ మళ్ళీ పండుగయి పలకరిస్తుంది
వసంతం చిలకరిస్తుంది.
పండగలకూ పబ్బాలకూ
పెళ్ళిళ్ళకూ పేరంటాలకూ
చేసిన అప్పుల కుప్పను
గుండె గదిలో ఓ మూలకు నెట్టి
ప్రశంసా చూపుల్లో మెచ్చుకోలు మాటల్లో
ఆనందాన్ని వెతుక్కునే వాణ్ణి

పదిమందికి పప్పన్నం పెట్టాలంటే
పదిసార్లు ఆలోచించడం
అలవాటు చేసుకున్నవాణ్ణి

అధికారం ప్రకటించే ప్రతి పథకానికి
నా జేబొక అక్షయ పాత్ర
బరువును బాధ్యతా మోస్తూ
పెద్దరికాన్ని ఒలకబోస్తున్న వాణ్ణి

సమస్యల చిల్లులు ఎన్ని ఉన్నా
నిండుకుండలా కనిపించే సగటు జీవిని
మధ్యతరగతి సామ్రాజ్యానికి
మకుటం లేని మహారాజును.

# సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక ఆవిష్కరణ

## సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక ఆవిష్కరణ

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో మానికొండ సూర్యావతి భవనంలో జూలై 9న సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచికను సాహితీ స్రవంతి సభ్యులు ఆవిష్కరించారు. సాహిత్య ప్రస్థానం ప్రతి సంవత్సరం ప్రత్యేక సంచికను తీసుకు వస్తుంది. ఈ సం॥రం ప్రచురించిన ప్రత్యేక సంచికలో గతంలో ప్రసిద్ధ కవుల, రచయితల రచనలను ప్రచురించారు. జాతీయ అంతర్జాతీయ కవులు, రచయితలు ముఖ్యంగా పీడిత పక్షాన నిలిచిన వారిని, జాతీయోద్యమంలో పాల్గొన్న వారిని తీసుకున్నారు.

అరసం, విరసం తరువాత ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రపంచీకరణ, మతోన్మాదం, ఉగ్రవాదాన్ని వ్యతిరేకించే ప్రగతిశీల సాహితీపరులనందరినీ ఒక వేదికపైకి తీసుకురావడానికి సాహితీ స్రవంతి కృషి చేస్తోందని ఆ సంస్థ జిల్లా కన్వీనర్ కుమారస్వామి పేర్కొన్నారు. కొత్త తరం కవులను, రచయితలను ప్రోత్సహించేందుకు స్రవంతి కృషి చేస్తుందని ఆయన తెలిపారు. ముదిగొండ కాల్పుల సందర్భంలో 'భూస్వరాలు' పేరుతో కవులు తమ నిరసన గళాలను వినిపించారని సాహితీ స్రవంతి నగర కన్వీనర్ మురళీకృష్ణ గుర్తు చేశారు.



సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక ఆవిష్కరణ సభలో సాహితీ స్రవంతి సభ్యులు రాంభూపాల్, పి. కుమార్‌స్వామి, టి. కృష్ణయ్య, ఎం. మురళీ కృష్ణ, సురేష్

సాహిత్యాన్ని ప్రజలకు ముఖ్యంగా ప్రజా సమస్యలపై పోరాటం చేసే వారందరి దగ్గరకు తీసుకెళ్ళి కృష్ణయ్య పేర్కొన్నారు. సాహిత్యం వివిధ సందర్భాలలో సామాజిక కర్తవ్యాలను, ప్రత్యేక భూమిక నిర్వహించిందని సోదాహరణంగా మరో రచయిత సురేష్ వివరించారు. అందువల్ల సాహిత్యాన్ని ప్రతి ఒక్కరూ అధ్యయనం చేయాలన్నారు. ఈ కార్యక్రమంలో వివిధ సంఘాల సభ్యులు పాల్గొన్నారు.

## 'దిక్సూచి' ఆవిష్కరణ

ఒక్క సిరాచుక్క లక్ష మెదళ్ళను కదిలిస్తుందని డి.ఎఫ్.ఓ. బి.నాగరాజు అన్నారు. కడప నగరంలో జూలై 11న ప్రస్థానం ప్రత్యేక సంచికను ఆయన ఆవిష్కరించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ ఒక మొక్క వేల మందికి నీడనిస్తుందని, ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళను కదిలిస్తుందని ప్రజాకవి కాళోజి అన్నది అక్షర సత్యమని చెప్పారు. సాహిత్యాన్ని ఆదరించాల్సిన బాధ్యత ప్రత్యేకించి అభ్యుదయ శక్తులపైనే ఉందన్నారు. విద్యార్థి దశలో శ్రీశ్రీ సాహిత్యాన్ని అధ్యయనం చేసిన జ్ఞాపకాలను ఈ సందర్భంగా ఆయన నెమరేసుకున్నారు. ప్రముఖ కథా రచయిత, చర్మ వైద్య నిపుణులు డాక్టర్ కోటకొండ మనోహర్ మాట్లాడుతూ సాహిత్యమే సమాజానికి దిక్సూచి అన్నారు. ఇది సాహితీ ప్రియులకే కరదీపికలాంటిదని కొనియాడారు. సామాన్య పాఠకులు ఉత్తమ సాహిత్యం, వాటి విలువలు తెలుసుకోవాలంటే 'దిక్సూచి' తప్పక చదవాలన్నారు. సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు ఎ. రఘునాథరెడ్డి మాట్లాడుతూ సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక ప్రాచీన అభ్యుదయ



జూలై 11న ప్రస్థానం ప్రత్యేక సంచిక ఆవిష్కరణ దృశ్యం

రచయితలందరి వేదిక అన్నారు. సమాజాన్ని సరైన దిశలో నడిపించేందుకు అవసరమైన దృక్పథాన్ని ఆధునికతను అందించడమే సాహితీ స్రవంతి లక్ష్యం అన్నారు. సాహితీ స్రవంతి ప్రచురిస్తున్న 'ప్రస్థానం' వర్ధమాన రచయితలందరిని ప్రత్యేకించి ప్రోత్సహిస్తుందన్నారు. కార్యక్రమంలో సాహితీప్రియులు ఎం. సిద్ధయ్య, పి. ఇరగయ్య, వెంకటరత్నం, జె. రవికుమార్ పాల్గొన్నారు.

# మానవత్వ దిశగా ప్రస్థానం సాగాలి



ప్రస్థానం ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తున్న డాక్టర్ రావెళ్ళ శ్రీనివాసరావు, వడ్లమూడి పద్మ, నండూరి రాజగోపాల్, గోళ్ళ నారాయణరావు తదితరులు

తెలుగు భాష సంస్కృతి ముఖ్యంగా సామ్యవాదం మానవత్వం అన్నీ మహాప్రస్థాన దిశగా సాగాలని ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ కార్యదర్శి గోళ్ళ నారాయణరావు అన్నారు. సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక ఆవిష్కరణ జూలై 17న శ్రీశ్రీ సభా మందిరంలో జరిగింది. సాహితీ స్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమానికి నగర అధ్యక్షులు డాక్టర్ రావెళ్ళ శ్రీనివాసరావు అధ్యక్షత వహించారు. ప్రస్థానం ప్రత్యేక సంచికను గోళ్ళ నారాయణరావు ఆవిష్కరించి అనంతరం మాట్లాడుతూ ఆశాభావాన్ని అణచివేస్తూ అంతర్మథనాన్ని కలిగించే దిశగా ఆత్మన్యూనత కలిగించే దిశగా రచనలు వస్తున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు. తోటి మనిషికి సాయపడాలనే మానవత్వపు విలువల్ని పెంచగల్గే దిశగా రచయితలు తమ రచనలు సాగించాలని కోరారు. ఆనాటి ప్రముఖ రచయితల రచనల్ని కూర్చి ప్రత్యేక సంచికగా తేవటం ఎంతో అభినందనీయమన్నారు. ఇలాంటి రచనలను అధ్యయనం చేసేందుకు నేటి తరానికి మంచి అవకాశం లభించిందని దీన్ని సద్వినియోగం చేసుకోవాలని కోరారు. చినుకు పత్రిక ఎడిటర్ నండూరి రాజగోపాల్, సీనియర్ జర్నలిస్టు వడ్లమూడి పద్మ పుస్తకాన్ని సమీక్షిస్తూ ప్రసంగించారు. బూరుగుపల్లి ప్రభావతి సభను ప్రారంభించారు. సాహిత్య స్రవంతి జిల్లా అధ్యక్షుడు సత్యరంజన్ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

# నేటితరం సాహితీకారులకు 'దిక్సూచి' ఒక పాఠ్యగ్రంథం




జూలై 24న ఖమ్మంలో జరిగిన 'దిక్సూచి' ఆవిష్కరణ సభ

నేటితరం సాహితీకారులకు సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక 'దిక్సూచి' ఒక పాఠ్యపుస్తకంగా ఉపయోగపడుతుంది. గురజాడ నుండి టాగూరు వరకు, టాగూరు నుండి గోర్కీ, హెరాల్డ్ పింటర్ వరకు ప్రసిద్ధుల సాహితీ భావాల సుగంధ సుమహారాల్ని దిక్సూచి పేర సాహితీ స్రవంతి మనకు అందించిందని ఖమ్మంలో జరిగిన దిక్సూచి ఆవిష్కరణ సభలో పలువురు వక్తలు అభినందనలు తెలుపుతూ కొనియాడారు.

జూలై 24న స్థానిక జిల్లా కేంద్ర గ్రంథాలయంలో సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు కె. ఆనందాచారి అధ్యక్షతన 'దిక్సూచి' ఆవిష్కరణ సభ జరిగింది. ప్రముఖ సాహితీవేత్త డా॥ పొత్తూరి సుబ్బారావు ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. వైద్యులు, కవి డా॥ గిరిసింహారావు దిక్సూచి సంచికను పరిచయం చేస్తూ తెలుగు, భారతీయ, ప్రపంచ ప్రసిద్ధుల సాహిత్య విశ్లేషణలు గల ఈ సంచిక ప్రతి సాహితీకారుని చేతుల్లో ఉండాల్సినదని, ఇలాంటి ప్రత్యేక సంచికలు ఇంతక్రితం నేనెప్పుడూ చూడలేదని, ఈ రకమైన కృషి చేసి తీసుకువచ్చిన సాహితీ స్రవంతికి అభినందనలు తెలిపారు.

సరిహద్దులకు కాలానికి అతీతంగా ప్రముఖుల సాహిత్య విశ్లేషణలు, రచయితలు, కవులు ఎలా వుండాలి, ఏమి రాయాలి, వారు సమాజాన్ని ఎలా పరిశీలించాలో తెలిపే నిజమైన 'దిక్సూచి'లా ఇది పనిచేస్తుందని అధ్యక్షులు కె. ఆనందాచారి వివరించారు. నాలాంటి వారికి ఒక గైడ్‌లా వుందని, నేను తెలుసుకోవలసింది ఇంకా చాలా వుందనే విషయం ఈ సంచిక చదివిన తర్వాత అర్థమయిందని కవి పోతగాని సత్యనారాయణ వివరించాడు. సాహితీ స్రవంతి జిల్లా కార్యదర్శి రౌతు రవి 'స్రవంతి' కార్యక్రమాలకు, సంచిక తీసుకురావడంలో సహకారం అందిస్తున్న సాహితీ ప్రియులకు కృతజ్ఞతలు తెలిపారు. లెనిన్ శ్రీనివాస్ స్వాగతం పలుకగా కె. వెంకటయ్య జాషువా పద్యాలు పాడి సభికులను అలరించారు. ఇంకా ఈ సభలో రాయుల మురళీమోహన్, బేగ్, రమణ, దాక్షాయణి, నీరుకొండ మొదలైన వారు పాల్గొన్నారు.

# తెలుగు నుడికారానికి గుడికట్టిన 'జాషువా'



జూలై 20న విజయనగరం గురజాడ కేంద్ర గ్రంథాలయలో జరిగిన గుర్రం జాషువా వర్ధంతి మరియు దిక్సూచి పుస్తకావిష్కరణ సభ

కవి కోకిల, సుకవి, విశ్వనరుడైన పద్మభూషణ్ గుర్రం జాషువా వర్ధంతి మరియు దిక్సూచి పుస్తకావిష్కరణ సభ జూలై 20న విజయనగరం గురజాడ కేంద్ర గ్రంథాలయ జరిగింది. సభను నిర్వహించిన చీకటి దివాకర్ మాట్లాడుతూ విశ్వనరుడిగా ప్రకటించుకొన్న జాషువాను ఈనాడు మననం చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉందన్నారు.

సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక 'దిక్సూచి' ఆవిష్కర్త, గ్రంథాలయ అధ్యక్షులు రొంగలి పోతన మాట్లాడుతూ సాహితీ సంస్థల్లో సాహితీ స్రవంతి క్రమం తప్పకుండా కార్యక్రమాలను చేస్తూ ప్రజలను, సాహితీవేత్తలను కలుపుకొని వెళ్ళడం ఆనందదాయకమన్నారు. జాషువా సామాజికపరమైనటు వంటి, ఆయన ఎదుర్కొన్నటు వంటి ఇబ్బందులతో ఈనాడు మార్గదర్శకంగా నిలిచారని, మహావ్యక్తులు చేసినటువంటి సేవ తరతరాలుగా గుర్తుండిపోతుందని, వారిని స్ఫూర్తిగా, ఆదర్శంగా తీసుకోవాలని సూచించారు.

ముఖ్య అతిథిగా విచ్చేసిన పట్టభద్రుల ఎం.ఎల్.సి., ఎం.వి.ఎస్. శర్మ మాట్లాడుతూ దిక్సూచి విశిష్టత కలిగిన సంచికగా, జాతీయ అంతర్జాతీయ సాహితీవేత్తల మహాగతులకు నిలువుటద్దంగా నిలుస్తున్నాయని, మన సంస్కృతి, కళలను ఆధునిక దృక్పథంతో రచయితలు ఈ వ్యాసాల్లో అందంగా పొందుపరచారని సోదాహరణగా తెలిపారు. సాహిత్యం గూర్చిన అవగాహన కల్పించడానికి, పాఠకుడిగా మనం ఏ విధంగా ఆస్వాదించి, అర్థం చేసుకోవాలో తెలుసుకోవడానికి ఉపయోగపడే పుస్తకమన్నారు. దిక్సూచి అని ఎందుకన్నారంటే ఒక స్థూలదృష్టితో చూడటానికి అనువుగా వున్నదని, ప్రత్యేక లక్షణం కలిగి ఉన్నదన్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో సాహిత్యం ముక్కలైపోయిందని, అస్తిత్వ రాజకీయాలు వచ్చాక వేటికవే ప్రత్యేకమైపోయాయని, అలాగే సాహిత్యరంగంలో కూడా జరిగిందన్నారు. సాధారణ లక్షణము, ప్రత్యేక లక్షణం కలిసి వుంటాయని, కనుక ఆ విధంగానే చూడాలని, అస్తిత్వంతో పాటు సాధారణ సాహిత్యాన్ని కూడా చూడాలన్నారు. ప్రపంచీకరణ వలన ఎక్కువగా నష్టపోయినది దళితులేనని, కులతత్వానికి వ్యతిరేకంగా, పెత్తందారుల దురహంకారానికి వ్యతిరేకంగా జాషువా తన సాహిత్యంలో దునుమాడారని కొనియాడారు. ఆయన కవిత్వం అందరికి అర్థమైన, సాంప్రదాయ ఛందోబద్ధంగా వుండేవని, ఈయన రచనలు ఎక్కువగా ప్రాచుర్యం పొందలేకపోవడానికి సామాజిక తరగతి, ఛందోబద్ధతే కారణమని అభిప్రాయపడ్డారు. ఉత్తరాంధ్ర వెనుకబడి వున్నప్పటికి సాహిత్యరంగంలో అభివృద్ధి చెందుతుందని, ప్రస్తుత అస్తిత్వ ఉద్యమాలు కులాల విభజనకు దారితీస్తున్నాయన్నారు. కొన్ని సామాజిక తరగతులు వారి గురించి వారే ఆలోచించుకొని సమాజాన్ని మర్చిపోతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు.

ఆచార్య భావనగారమ్మాయి పీసపాటి శిరీష మాట్లాడుతూ జాషువా మీద పరిశోధన చేసిన మొట్టమొదటి వ్యక్తయిన భావనగారిని తలచుకొని జాషువా రచనల్లో కరుణ, వీర రసాలకు అధిక ప్రాధాన్యత ఇచ్చారని, స్త్రీని వీరమాతగా చిత్రీకరించారన్నారు. తెలుగు నుడికారానికి కవి కోకిల జాషువా గుడి కట్టారని, ఆయన రచనలు సామాజిక చైతన్యానికి సారథ్యం వహిస్తూ అణగారిన బ్రతుకుల్లో ఆశాజ్యోతులు వెలిగించారన్నారు. ప్రధానంగా కులం, పేదరికమనే రెండు సమస్యలను ఎదుర్కొన్నారని, పేదరికాన్ని పట్టించుకోకపోయినా కులం, అణచివేతలను గూర్చి నిరసించిన వ్యక్తన్నారు. పంచముడినని చెప్పుకోవడానికి ఎప్పుడూ వెనుకంజ వేయలేదని, తన కవితాశక్తిని ఆయుధంగా మార్చుకొని కులమనే కొండచిలువను చీల్చారన్నారు. స్త్రీలకు సముచిత స్థానం కల్పించిన జాషువా ఎదుటి వారి హృదయాలకు హత్తుకొనేలా చారిత్రక ఘట్టాలు చెప్పడంలో దిట్టన్నారు. సమత, మమత ఉన్నప్పుడే మానవత్వం వస్తుందన్నారు. సాలెగూడును గూర్చి 5, 6 పద్యాలు రాయడం అసాధారణ విషయంగా అభివర్ణించారు. జాషువా రాసిన గబ్బిలం కథ కాళిదాసు రాసిన మేఘ సందేశాన్ని ఆధారం చేసుకున్నదని, ఒక అస్పృశ్యుడు తన సందేశాన్ని గబ్బిలం ద్వారా శివునికి విన్నవించుకున్నట్లు ఓ కల్పిత కవితను రాస్తాడన్నారు. పంచమ కులం ఎక్కడి నుండి పుట్టుకొచ్చిందని ప్రశ్నించిన ధీశాలి అన్నారు. గబ్బిలం మొదటి భాగం స్వాతంత్ర్యానికి ముందర, రెండవ భాగం స్వాతంత్ర్యం తరువాత రాసిందన్నారు. ఫిరదౌసి అద్భుత కళాఖండమని, వెక్కిరించిన వారిని ధిక్కరించిన మహోన్నత వ్యక్తి జాషువా అని కొనియాడారు.

చెరసాల్లో హించించి కొట్టినా, శత్రువుల దాడిలో కనుమూసిపోయిన, అంటరానోడని హేళన చేసినా, తెల్లోని చెర నుండి దేశాన్ని విడిపించి అక్షరాలపై పట్టును సాధించమంటే యువతలో పట్టుదలే కారణమని తెలిపే సందేశాత్మక గేయం "నేలరాలిన మందారాలు" సభ ప్రారంభ సూచికగా చంద్రిక, రమణమ్మ, సింహాచలం, ఆర్. ఆనందర్, కె. ఆనంద్ బృందం పాడి వినిపించగా, యాగంటి రవి, జి. వినోద్ పాటలు పాడగా, మిర్యాల కృష్ణారావు కవితను వినిపించారు. కె.వి.ఆర్. కృష్ణారావు సభకు ఆహ్వానం పలుకగా, కె. ఆదిలక్ష్మి వందన సమర్పణతో సభ ముగిసింది. చీకటి దివాకర్ సాహితీ స్రవంతి భవిష్యత్ కార్యక్రమాలను తెలియజేశారు.

# మెరుగు

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో శ్రీశ్రీ వర్ధంతి, ఎం.ఎఫ్. హుస్సేన్, నటరాజ రామకృష్ణల సంస్మరణ కార్యక్రమం జూన్ 15న గురజాడ వారి స్వగృహంలో జరిగింది. చీకటి దివాకర్ మాట్లాడుతూ శ్రీశ్రీ శతజయంతి సభలు రాష్ట్ర నలుమూలల ఏ రచయితకు, కళాకారునికి జరగనంతగా ప్రజలు నీరాజనాలు పట్టడానికి కారణం ప్రాపంచిక దృష్టేనన్నారు. శ్రీశ్రీ ప్రపంచ కార్మికులు, శ్రామికులు అందరూ ఏకం కావాలంటాడని, సమస్త వృత్తులు, మానవులంతా ఒకటిగా ఉండాలని కోరుకున్నాడన్నారు. భారతదేశ భిన్నత్వాన్ని అర్థం చేసుకొని, మూలాలను అధ్యయనం చేసి పురాణ ఇతిహాసాలతో సహ అంతర్లీనంగా భారతదేశానికున్న సహనం, లౌకికతత్వాలను ఎం.ఎఫ్. హుస్సేన్ అర్థం చేసుకున్నారన్నారు. విశ్వవిఖ్యాతమైన హుస్సేన్ మీద మతోన్మాదులు దాడులు చేసి భారతదేశ గడ్డపై లేకుండా చేశారన్నారు. 1970లో వేసిన రెండు, మూడు చిత్రాలను సాకుగా చూపి 25 సం॥ల తరువాత భౌతిక దాడులు చేసి, వివాదాన్ని రేపారన్నారు.

సామాన్య మధ్యతరగతి కుటుంబంలో 1923లో జన్మించిన నటరాజ రామకృష్ణ కళకు అంకితమై అనేక నృత్యరీతులను అధ్యయనం చేసి, శాస్త్రీయతను చేకూర్చి అంకితభావంతో కృషి చేశారన్నారు. జానపద, తప్పెటగుళ్ళు, గంగనృత్యం, వీరనృత్యం, పేరిణి, యక్షగానం ఇలా అనేక నృత్యరీతులను అధ్యయనం చేసి పునరుజ్జీవనం చేయడమే కాకుండా అనేక గ్రంథాలను రచించాడన్నారు. తన నిండు జీవితాన్ని కళ కోసమే వెచ్చించి రెండువేల సం॥ల చరిత్ర గలిగిన ఆంధ్రనాట్యంను తెలుగు విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. కోర్సుగా ప్రవేశపెట్టడానికి ఎంతగానో కృషి చేశారన్నారు.

జక్కు రామకృష్ణ, రాజా చంద్రశేఖర్, రెడ్డి రామకృష్ణ, పిళ్ళా రాంకుమార్ మొదలగువారు ప్రసంగించారు. దీనికి ముగింపుగా దివాకర్ మాట్లాడుతూ కవి, కళాకారుడు, ఆర్టిస్ట్ చాలా సున్నిత మనస్సు కలవారన్నారు. సమాజంలో జరుగుతున్నటువంటి పరిణామాలకు స్పందించి రాయడం, చిత్రాలు గీయడం వంటి స్వేచ్ఛను కలిగి ఉంటారన్నారు. ఈనాడు మన భాష, సంస్కృతులను రక్షించుకోవలసిన అవసరముందన్నారు. హుస్సేన్ చిత్రాలు అత్యంత ఖరీదువైనప్పటికి సన్నిహితులకు, స్నేహితులకు బహుమతులుగా ఇచ్చారన్నారు. విలువైన 40 పెయింటింగ్స్ ఎయిరిండియాకు ఉదారంగా ఇచ్చారని, ఢిల్లీలో అవి అతీగతి లేకుండా హీనమైన స్థితిలో ఉండటం బాధాకరమన్నారు. విలువలతో కూడిన పెయింటింగ్స్ అలా ఉండటం నిర్లక్ష్య వైఖరిని తెలియజేస్తుందన్నారు.

ఆనంద్, భళ్ళమూడి నాగేంద్రప్రసాద్ పాటలు వినిపించగా, టి. రామకృష్ణ, ఇనపకుర్తి సత్యనారాయణ తమ కవితలను వినిపించారు.

# కళావిజ్ఞాన పురస్కారాలు ప్రధానం

తిరుపతి బైరాగిపట్టెడలోని గంధమనేని శివయ్య భవన్‌లో జూన్ 5న కళా విజ్ఞాన పురస్కారాలు ప్రదానం సభ జరిగింది.

కీర్తి కోవెల పురస్కారం కథా రచయిత్రి డా॥ఎం.ఎం.వినోదినికి రాజాచంద్ర ఫౌండేషన్ పురస్కారం, చిత్రకారుడు అన్వర్‌కు, మహర్షి కృష్ణానంద కళా పురస్కారం అవధాని ఆముదాల మురళికి, మల్లారపు కళా పురస్కారం పల్లె నరసింహకు ప్రధానం చేశారు. పురస్కార గ్రహీతలు ఒక్కొక్కరికి రూ॥ 25,000/-లు, శాలువ, జ్ఞాపికలతో ఘనంగా సత్కరించారు. ఈ సభలో అతిథులు, వక్తలుగా ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్య మండలి గౌరవాధ్యక్షులు నల్లూరి వెంకటేశ్వర్లు, అరసం రాష్ట్ర అధ్యక్షులు పెనుగొండ లక్ష్మీనారాయణ, సాహితీ నేత్రం సంపాదకులు శశిశ్రీ రచయితలు వి. ప్రతిమ, సం.వెం.రమేష్, ఆర్.ఎం.ఉమా మహేశ్వర రావులు పాల్గొన్నారు.

సాహితీ కళారంగాలలో విశిష్ట సేవలందించిన వ్యక్తులను గౌరవించి, ప్రోత్సహించడానికి ఏటేటా ఈ పురష్కారాలు ప్రధానం చేస్తున్నామని నిర్వాహకులు కోట పురుషోత్తం, సాకం నాగరాజులు ప్రకటించారు.



నిర్వాహకులతో పురస్కార గ్రహీతలు డా॥ ఎం.ఎం. వినోదిని, ఆముదాల మురళి, పల్లెన నరసింహ, అన్వర్‌లు




జూలై 1న హైదరాబాద్ శ్రీ త్యాగరాయ గానసభలో కిన్నెర ఆర్ట్స్ ఆధ్వర్యంలో జరిగిన వెయ్యి నవలల రచయిత 'కొవ్వలి' శతజయంతి సభలో ఎమెస్కో ప్రచురించిన "కొవ్వలి నవలలు" పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న డా॥ సి. నారాయణరెడ్డి. ఎడమ నుంచి కొవ్వలి లక్ష్మీనారాయణ, మండలి బుద్ధప్రసాద్, కొవ్వలి నాగేశ్వరరావు, ద్వా.నా.శాస్త్రి

# సాహిత్య జీవనది శ్రీశ్రీ

శ్రీశ్రీ వర్ధంతి పురస్కరించుకుని జూన్ 17న 'శ్రీశ్రీ బులెటిన్-18' ఆవిష్కరణ సభ గవర్నరుపేటలోని శ్రీశ్రీ సభా మందిరంలో జరిగింది. ఈ కార్యక్రమానికి సాహితీ స్రవంతి నగర అధ్యక్షులు డాక్టర్ రావెళ్ళ శ్రీనివాసరావు అధ్యక్షత వహించారు. ఈ సభలో ముఖ్య అతిథి భువనచంద్ర మాట్లాడుతూ తాను చెప్పదలచిన విషయాన్ని సూటిగా చెప్పడం శ్రీశ్రీ గొప్పతనమన్నారు. శ్రీశ్రీ ఏనాడూ నిరాశావాదం వైపు వెళ్ళలేదన్నారు. సాహితీ స్రవంతి వారు నిర్వహిస్తున్న శ్రీశ్రీ సభలో పాల్గొనడం తనకు ఓ అవార్డు రావడంగా భావిస్తున్నానన్నారు. బులెటిన్ ఆవిష్కర్త ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ అధ్యక్షులు గోళ్ళ నారాయణరావు మాట్లాడుతూ మంచి రచనలు చేసే రచయితలకు ప్రోత్సాహకాలు అందిస్తానని ప్రకటించారు. శ్రీశ్రీ రచనలు ఎన్నిసార్లు చదివినా కొత్తగానే ఉంటాయన్నారు. శ్రీశ్రీ బులెటిన్‌ను ఆవిష్కరించడం తనకు ఎంతో గర్వకారణంగా ఉందన్నారు. బులెటిన్ సంపాదకులు సింగంపల్లి అశోక్‌కుమార్ మాట్లాడుతూ ఈ బులెటిన్ ప్రచురణకు తనతో సహకరించిన వారికి ధన్యావాదాలు తెలిపారు. ఈ బులెటిన్‌కు వివిధ శీర్షికలు, రచనల కూర్పు, శ్రీశ్రీ క్విజ్ గురించి ప్రజా సాహితీ సంపాదకులు కొత్తపల్లి రవిబాబు సోదాహరణంగా వివరించారు. ఈ కార్యక్రమానికి సాహితీ స్రవంతి సహాయ కార్యదర్శి బూరుగుపల్లి ప్రభావతి స్వాగతం పలుకగా, జిల్లా అధ్యక్షులు కె. సత్యరంజన్ వందన సమర్పణ చేశారు. ఈ కార్యక్రమంలో పలువురు సాహితీవేత్తలు, శ్రీశ్రీ అభిమానులు పాల్గొన్నారు. ప్రజానాట్యమండలి జిల్లా కార్యదర్శి ఆర్. రాజేష్ బృందం ఆలపించిన శ్రీశ్రీ గీతాలు ఎంతగానో ఆకట్టుకున్నాయి.



**జూన్ 17న శ్రీశ్రీ బులెటిన్ 18ని ఆవిష్కరిస్తున్న గోళ్ళ నారాయణరావు, చిత్రంలో సినీ గేయరచయిత భువనచంద్ర, అశోక్‌కుమార్, కొత్తపల్లి రవిబాబు, రావెళ్ళ**

# అక్షరజలధి : దాశరథి

"సాహిత్యరంగంలో వివిధ ప్రక్రియలలో తన సృజన ప్రతిభను చాటిన దాశరథి అక్షరజలధి. దాశరథి పద్యకవి, సినీకవి, గేయకవి, అభ్యుదయకవి, భావకవి, మనసున్న కవి" అని డా.కె.వి. రమణాచారి పేర్కొన్నారు. హైదరాబాద్-శ్రీ త్యాగరాయ గానసభలో డా॥ద్వా.నా. శాస్త్రి రచించిన "నవకవితాజలధి-దాశరథి" పుస్తకాన్ని ఆయన ఆవిష్కరించారు. దాశరథి సాహిత్యం సందేశాత్మకం అంటూ ద్వా.నా. శాస్త్రి దాశరథి జీవిత సాహిత్యాలను అందరికంటె విశిష్టంగా, పఠనీయంగా, సరళంగా రాశారన్నారు. అధ్యక్షతవహించిన డా॥రాళ్ళబండి కవితాప్రసాద్ మాట్లాడుతూ దాశరథి జాతీయకవిగా, నిజాం నిరంకుశత్వాన్ని ఎదిరించిన ఉద్యమ కవిగా, దేశభక్తి కవిగా నిలిచిపోతాడని పద్యాలు చదివి సభను ఉత్తేజపరిచారు. డా॥పి.మధుసూధనరావు తమకూ దాశరధికి గల పరిచయాన్ని వివరిస్తూ దిగ్గజాలు వున్న సభల్లో దాశరధి కొదమసింహంలా ఉండే వారంటూ ద్వా.నా.శాస్త్రి కొత్తదనంతో రాస్తారనీ, ఇందుకే దాశరధి అర్ధాంగి లక్ష్మిగారితో ఇంటర్వ్యూ వుండటం అపూర్వమన్నారు. ద్వా.నా. శాస్త్రి ఈ పుస్తకాన్ని శ్రీమతి లక్ష్మిగారికి అంకితమిస్తూ అయిదు వేల రూపాయిలతో సత్కరించారు. "నా మొదటి కవిత సంకలనాన్ని ఆవిష్కరించిన దాశరధిగారిపై పుస్తకం రాయడం నా అదృష్టం. దీనికి కారకులైన సి.పి.బ్రౌన్ అకాడమీ వారికి ధన్యవాదాలు" అన్నారు ద్వా.నా. శాస్త్రి, మద్దాళి రఘురాం, ఎ.ఎస్.మూర్తి, దాశరథి ఇందిర మొదలైనవారు పాల్గొన్నారు.



**జూలై 2న హైదరాబాద్ శ్రీ త్యాగరాయ గానసభలో కిన్నెర ఆధ్వర్యంలో జరిగిన సభలో డా॥ ద్వా.నా. శాస్త్రి రచించిన "నవ కవితా జలధి – దాశరథి" పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న డా॥ కె.వి. రమణాచారి (ఐ.ఎ.ఎస్). ఎడమ నుంచి కిన్నెర రఘురాం, దాశరథి సతీమణి శ్రీమతి లక్ష్మీ, ద్వా.నా. శాస్త్రి, డా॥ రాళ్ళబండి కవితా ప్రసాద్, డా॥ పి. మధుసూదనరావు, శ్రీ కళా దీక్షితులు**

# వేకువ

జూలై 10న అనంతపురం జిల్లా పెనుకొండ పట్టణం టి.టి.డి. కళ్యాణమండపంలో 'వేకువ' సాహితీ కళా సమాజ సేవా సంస్థ ఆధ్వర్యంలో రాష్ట్ర స్థాయి 'శత కవితా వసంతోత్సవం' 'వేకువ కవితా పురస్కారోత్సవం' జరిగాయి. రాష్ట్రం నలువైపుల నుండి కాక ముంబై, చెన్నై, బెంగుళూరు తదితర ప్రాంతాల నుండి వందలాది మంది కవులు, కళాకారులతో ఆబాలగోపాలాన్ని అలరించేలా సాహితీ పండగ జరిగింది. ఈ సభ ఉదయం 9.30 గంటలకు నుండి రాత్రి 8 గంటల వరకు ఏకధాటిగా నాలుగు వేదికలుగా నిర్వహించడం జరిగింది. ఈ ఉత్సవాలకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత కె. శివారెడ్డి, ప్రముఖ ప్రజా గాయకులు కవి గోరేటి వెంకన్న, ప్రముఖ దిగంబర కవి నగ్నముని, ప్రఖ్యాత సాహితీ విమర్శకులు అద్దేపల్లి రామమోహనరావు, ప్రముఖ సినీనటులు, కళాకారుల ఐక్యవేదిక రాష్ట్ర అధ్యక్షులు వి.కె. నరేష్, ప్రఖ్యాత కవులు డా॥ యాకూబ్, డా॥ శిలాలోలిత, డా॥ కె. ఆశాజ్యోతి, 'పాలపిట్ట' మాసపత్రిక సంపాదకులు గుడిపాటి, 'మల్లెతీగ' మాసపత్రిక సంపాదకులు కలిమిశ్రీ, 'సాహితీ కిరణం' సంపాదకులు పొత్తూరు సుబ్బారావు 'నెలవంక నెమలీక' సంపాదకులు లక్కరాజుదేవి, వై. శ్రీరాములు ముఖ్య అతిథులుగా విచ్చేయగా, మరో వందమంది కవులతో శత కవితా వసంతోత్సవ కవి సమ్మేళనం జరిగింది.




జూలై 10న అనంతపురం జిల్లా పెనుకొండ పట్టణం టి.టి.డి. కళ్యాణమండపంలో 'వేకువ' సాహితీ కళా సమాజ సేవా సంస్థ ఆధ్వర్యంలో రాష్ట్ర స్థాయి 'శత కవితా వసంతోత్సవం' 'వేకువ కవితా పురస్కారోత్సవం'

# శోభానాయుడుకు 'తంగిరాల' అవార్డు

ప్రముఖ కళాకారిణి, పద్మశ్రీ శోభానాయుడు కూచిపూడిలో ఆరంగ్రేటం చేసి అనతికాలంలోనే ప్రపంచ స్థాయి గుర్తింపు పొందారని ప్రముఖ నటుడు, పద్మవిభూషణ్ అక్కినేని నాగేశ్వరరావు కొనియాడారు. ఆదివారం రవీంద్రభారతిలో జరిగిన కార్యక్రమంలో 12వ తంగిరాల కృష్ణప్రసాద్ రంగస్థల పురస్కారాన్ని ఆయన శోభానాయుడుకు అందజేశారు. ఈ సందర్భంగా పర్యాటక శాఖ ఓఎస్‌డి ఎం. కాంతారావు, 'సాహితీ కిరణం' రంగస్థలి ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. జీవీఆర్ కల్చరల్ ఫౌండేషన్, తంగిరాల ట్రస్ట్ ఆధ్వర్యంలో నిర్వహించిన ఈ కార్యక్రమంలో ట్రస్ట్ ఛైర్మన్ తంగిరాల చక్రవర్తి, కూచిపూడి కళాకారిణి దీపికారెడ్డి, సాహితీకిరణం సంపాదకులు పొత్తూరి సుబ్బారావు పాల్గొన్నారు.



శోభానాయుడుకు పురస్కారం అందజేస్తున్న అక్కినేని. చిత్రంలో దీపికారెడ్డి, పొత్తూరి సుబ్బారావు, తంగిరాల చక్రవర్తి



ఇటీవల హైదరాబాద్‌లో కళా సుబ్బారావు కళావేదికలో జరిగిన రాష్ట్ర స్థాయి కవితల పోటీ బహుమతిగా పట్టాభి కళాపీఠం పురస్కారాన్ని రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ (దేవాదాయ) శాఖ ముఖ్య కార్యదర్శి డాక్టర్ కె.వి. రమణాచారి నుండి అందుకుంటున్న కవి కటుకోర్పుల రమేష్. చిత్రంలో కళాపీఠం వ్యవస్థాపకులు తూములూరి రాజేంద్ర ప్రసాద్, జె.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ వ్యవస్థాపకులు గుడిబండి వెంకటరెడ్డి తదితరులు



జూలై 3న మార్కాపురం 'నెల నెలా వెన్నెల' సాహితీ వేదిక ఆధ్వర్యంలో మంత్రి కృష్ణమోహన్ రచించిన 'మట్టి పలకలు' (నానీలు) పుస్తకావిష్కరణ సభలో ఎడమ నుంచి వరుసగా ఓరుగంటి మల్లిక్, సిహెచ్.పి. వెంకటరెడ్డి, బి. హనుమారెడ్డి, ఎన్. గోపి, మంత్రి కృష్ణమోహన్, ఎస్.ఎ.టి.కె. ఆచార్య, ఎస్. రఘు



జూన్ 8న డా॥ పట్టాభి కళాపీఠము (మచిలీపట్నం) శ్రీ త్యాగరాయ గానసభ – కళా సుబ్బారావు కళావేదిక, హైదరాబాద్‌లో నిర్వహించిన కార్యక్రమంలో పొత్తూరి సుబ్బారావు రచించిన "మనోహర దృశ్యం" కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న డా॥ కె.వి. రమణాచారి, ఐ.ఎ.ఎస్. చిత్రంలో సమీక్షకులు కేతవరపు రాజ్యశ్రీ, త్యాగరాయ గానసభ అధ్యక్షులు కళా వేంకట దీక్షితులు, కళాపీఠము వ్యవస్థాపక అధ్యక్షులు తూములూరి రాజేంద్రప్రసాద్, సభాధ్యక్షులు గుదిబండి వెంకటరెడ్డి, సుధామ, కృతి స్వీకర్త మల్లాది హరి శంకర ప్రసాద్, వి.వి. రాఘవరెడ్డి



ప్రముఖ కవి డా॥ ఎన్. గోపి రచించిన 'రాతి కెరటాలు' కవితా సంపుటిని హైదరాబాద్ తెలుగు విశ్వవిద్యాలయం ఎన్.టి.ఆర్. ఆడిటోరియంలో డా॥ సి. నారాయణరెడ్డి ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో రామాచంద్రమౌళి, డా॥ ముదిగంటి సుజాతారెడ్డి, సభాధ్యక్షులు సతీష్‌చందర్, కవి గోపి, కృతి స్వీకర్త డా॥ శేషాద్రి, ఓలేటి పార్వతీశం, కిన్నెర అధినేత మద్దాళి రఘురాం



జూలై 14వ తేదీన జరిగిన జనని సభలో నగదు బహుమతి అందజేస్తున్న అనిల్‌కుమార్‌రెడ్డి, శ్రీమతి శివరామన్, రాధాలక్ష్మి, గుడిమెట్ల చెన్నయ్య, కలికి రంగారెడ్డి



జూన్ 15న హైదరాబాద్‌లోని త్యాగరాయ గానసభలో ముంబయికి చెందిన ప్రముఖ కవి, రచయిత సంగెవేని రవీంద్ర రాసిన 'లోలోన...' కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న మాజీ మంత్రివర్యులు మండలి బుద్ధప్రసాద్. చిత్రంలో డా॥ తుర్లపాటి రాజేశ్వరి, ప్రభాకర్, డా॥ ద్వా.నా.శాస్త్రి, డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, రాళ్ళబండి కవితా ప్రసాద్, డా॥ మలయశ్రీ



జూన్ 19న శ్రీ త్యాగరాయ గానసభ, హైదరాబాద్‌లో జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ నిర్వహించిన పితృవందనం వేడుకల కార్యక్రమంలో పితృవందనం పేరిట ముఖ్య అతిథి, ఆంధ్రప్రభ సంపాదకులు పి. విజయబాబు ద్వారా సత్కారాలందుకున్న డా॥ పి.ఎస్. మూర్తి, వేదుల లక్ష్మీనారాయణ, వి. జ్ఞానేశ్వర్, వి. శశిప్రియ, డా॥ ద్వా.నా. శాస్త్రి, డా॥ బి. శ్రీనివాసరెడ్డి, సంస్థ ఛైర్మన్ గుదిబండి వెంకటరెడ్డి, సయ్యద్ జానీభాషా తదితరులు



జూన్ 26న రవీంద్రభారతిలో ధర్మకేతనం సాహిత్య కళాపీఠం ఆధ్వర్యంలో 'అవ్యక్త' గ్రంథావిష్కరణ సభలో పాల్గొన్న ఎన్వీ రఘువీర్ ప్రతాప్, డా॥ ఎం. కాంతారావు, ప్రొఫెసర్ శరత్ జ్యోత్స్నారాణి, వి.వి. పూర్వ ఉపాధ్యక్షులు కొలకలూరి ఇనాక్, ఆవిష్కర్త, ప్రముఖ సినీనటుడు రంగనాథ్, నేటి నిజం సంపాదకులు బైస్ దేవదాస్, రచయిత సుధామ

ప్రస్థానం ప్రత్యేక సంచిక చదివాను. అటువంటి ఆనాటి వ్యాసాలతో ఇటువంటి సంచిక తీసుకురావాలన్న ఆలోచనలోనే ఈ సంచిక విశిష్టత ఉంది. ఆ ఆలోచన అభినందనీయం. ఆనాటి రచయితల్లో, వారి రచనల్లో ఉన్న నిర్మాణశీలత, ఆచరణ శీలత, ప్రజా స్వేచ్ఛ పట్ల వారి బలమైన ఆకాంక్ష మరోసారి ముందుకు తీసుకువచ్చారు. ఆ మూడూ ఉన్న సాహిత్యమే సమాజంలో నిలుస్తుందన్న సత్యాన్ని మరోసారి మీ సంచిక గుర్తు చేసింది. సంపాదకవర్గానికి ధన్యవాదాలు.

**– జయంతి పాపారావు**

తెలుగు పత్రికా రంగంలో "సాహిత్య ప్రస్థానం" ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుందనేది చారిత్రక సత్యం. మిక్కిలి శ్రమకోర్చి సమర్థవంతంగా, విలక్షణంగా నడుపుతున్న మీకు అభినందనలు. వెలువరించిన ప్రత్యేక సంచికలు విశ్వవిద్యాలయ స్థాయిలో సంప్రదింపు గ్రంథాలుగా నిర్ణయించదగ్గ సత్తాను సంతరించుకున్నాయి.

**– కొండపల్లి సుదర్శనరాజు**

Sahitya Prasthanam June & July Sanchika excellent. Need to bringout such issues atleast once in a year. Useful to young as well as established writers. Hatsoff to the editorial board.

**- Prof. Deveraju Maharaju**

***జూన్ & జూలై 2011 'దిక్సూచి' ప్రత్యేక సంచికకు ఇంకా అనేక మంది ఫోన్ల ద్వారా, ఉత్తరాల ద్వారా, ఎస్ఎమ్ఎస్‌ల ద్వారా అభినందనలు తెలిపారు. కె. రామలక్ష్మి, కె. శివారెడ్డి, జనార్ధన మహర్షి, దిలావర్, కేతు విశ్వనాథరెడ్డి, కె. రామ్మోహన్‌రాయ్, గొరుసు జగదీశ్వరరెడ్డి, యాళ్ళ అచ్యుతరామయ్య, నామిని తదితర ప్రముఖులు ఫోన్‌ద్వారా ప్రత్యేకంగా తమ అభినందనలు తెలియజేశారు. వారందరికీ ధన్యవాదాలు తెలుపుకుంటున్నాం.***

**– సంపాదకవర్గం**

దిక్సూచి ప్రసిద్ధుల ప్రత్యేక సంచిక నిజంగానే ప్రత్యేకంగా, అద్భుతంగా, అమూల్యమైన సాహితీ విలువలతో కూడుకొని ఉంది. ఈ మధ్యకాలంలో విడుదలైన ప్రత్యేక పత్రికలకు భిన్నంగా, శాశ్వతంగా దాచుకునే స్థాయిలో ఉంది. మీ సంపాదక వర్గానికి నా హృదయపూర్వక అభినందనలు. తెలుగు సాహితీ రంగంలో 'సాహిత్య ప్రస్థానం'కు ఒక ప్రత్యేక స్థానం ఉన్నట్లే. ఈ ప్రత్యేక సంచిక కూడా చిరస్థాయిగా పాఠకుల గుండెల్లో నిలిచిపోతుందనడానికి ఎలాంటి సందేహం లేదు.

**– సంగెవేని రవీంద్ర**

నేటి కవిత్వంలోని గుణాత్మతకు తృప్తి చెందని సాహితీ స్రవంతి నవ కవులకు రచయితలకు మార్గదర్శకము కావాలనే మహోన్నత దృక్పథంతో శ్రమించి అందించిన ప్రత్యేక సంచిక జూలై 2011 పాఠకులను ముగ్ధులను గావించి, కవులకు కరదీపిక దిక్సూచి అయింది. సంపాదకులు మనోభావనను దిక్సూచి ప్రత్యేక సంచిక పదింతలు ఫలప్రదం చేసినట్లే. సంచిక రూపు, ప్రకటనలు హుందాగా వుండి, ఆధునిక సాహిత్య ఆరంభ కాలమును పాఠకుల ముంగిట ఆరబోసింది. సంచిక రూపకల్పన సంకలనములలోని శ్రమ, దీక్ష, అంకితత్వములకు అభినందనలు, అభివందనములు కృతజ్ఞతలు.

**– బండి ప్రసాదరావు**




Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**



# ఆపన్నులకు ఆసరా.. మహిళలకు అభయ హస్తం



## ఆసరా లేని వారిని ఫించన్లతో ఆదుకుంటున్న రాష్ట్ర ప్రభుత్వం








వృద్ధులు, వితంతువులు, వికలాంగులు తమ జీవనాన్ని కొనసాగించడానికి ఎవరిపైనా ఆధారపడకుండా ఆత్మస్థైర్యంతో బ్రతకడానికి చేయూతనిచ్చే విధంగా మన రాష్ట్ర ప్రభుత్వం నెలనెలా ఫించన్లు అందించి వారికి సామాజిక భద్రత కల్పించి వెన్నుదన్నుగా నిలిచింది. వృద్ధాప్యంలో మహిళలు నిర్లక్ష్యానికి గురి కాకుండా ఉండటానికి ఫించన్లు అందజేస్తోంది. స్వయం సహాయక సంఘాల ద్వారా 60 ఏళ్ళ వయస్సు నిండినవారు గరిష్ఠంగా రూ.2,200/- వరకూ ఫించన్లు అందుకోవడంతో వారికి వృద్ధాప్యం అంటే బెంగ లేకుండా పోయింది. ఇది దేశంలోనే అత్యంత ఆదర్శవంతమైన పథకంగా పేరుగాంచింది. ఈ పథకాల అమలు మెరుగుపరిచేందుకు స్మార్ట్ కార్డుల ద్వారా చెల్లించడంతో నేరుగా లబ్ధిదారులకే చెల్లించబడుతుంది.

**ఎన్. కిరణ్‌కుమార్ రెడ్డి**
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి

### ఫించన్లు కార్యక్రమం అమలు

- వికలాంగులకు రూ.500 ఫించను
- మొత్తం 72 లక్షల మంది లబ్ధిదారులు
- 43 లక్షల మంది వృద్ధులకు ఫించన్లు
- 18.8 లక్షల మంది వితంతువులకు ఫించన్లు
- 8.84 లక్షల మంది వికలాంగులకు ఫించన్లు
- 1.44 లక్షల మంది చేనేత కార్మికులకు ఫించన్లు
- లక్ష మంది గీత కార్మికులకు ఫించన్లు
- రూ.1,574.92 కోట్ల ఫించన్ల చెల్లింపు
- ఫించన్లు స్మార్ట్‌కార్డుల ద్వారా చెల్లింపు
- ఎయిడ్స్ బాధితులకు చికిత్స కోసం ఫించను
- ఎయిడ్స్ బాధితులకై 2010-11 లో రూ.1932 కోట్ల బడ్జెట్ కేటాయింపు

### అభయహస్తం కార్యక్రమం అమలు

- 43 లక్షల మంది మహిళా సభ్యులు
- సభ్యులు జమ చేసిన సొమ్ము రూ.322.08 కోట్లు
- ప్రస్తుతం ఫించను పొందుతున్న వారు 3.8 లక్షలు
- గరిష్ఠంగా రూ.2,200/- వరకు ఫించను
- 14 లక్షల మంది కొత్త సభ్యులు
- అకాల మరణానికి గురైన 13,063 మందికి రూ.36.7 కోట్ల చెల్లింపు
- పథకంలోని సభ్యుల పిల్లలకు రూ.31.87 కోట్లు ఉపకారవేతన చెల్లింపు

49

జారీ చేసినవారు : సమాచార, పౌరసంబంధాల శాఖ

SAHITYA PRASATHANAM RNI N0.APTEL/2004/18396 Postal Regd. No.H/SD/415/10-12



# ప్ర...శక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల: రూ. 100/-




వెల: రూ. 35/-




వెల: రూ. 150/-




వెల: రూ. 125/-




వెల: రూ. 125/-




వెల: రూ. 75/-




వెల: రూ. 80/-




వెల: రూ. 200/-




వెల: రూ. 30/-




వెల: రూ. 90/-




వెల: రూ. 200/-




వెల: రూ. 25/-




వెల: రూ. 15/-




వెల: రూ. 150/-




వెల: రూ. 25/-




వెల: రూ. 35/-




వెల: రూ. 100/-




వెల: రూ. 60/- 50




వెల: రూ. 40/-




వెల: రూ. 65/-

**ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136**

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A128 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha. |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |